(శ)

# హైమవతీవిలాసము

శతావధాని, కావ్యకలానిధి


పి. చిదంబరశాస్త్రి

ప్రణీతము.




ద్వితీయముద్రణము


పిఠాపురము

శ్రీవిద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల

1930.


పద్యవ్యాఖ్యాసంకలితము] [0. 8-0.



# హైమవతీవిలాసము

## ప్రథమాశ్వాసము

శా. శ్రీకల్యాణగుణాస్పదంబు సకలశ్రేయఃప్రధానంబు మ
నైకప్రాభవ మపారశక్తిక మనుత్ప్రేక్ష్యంబు నానాప్రపం
చాకారం బనవద్య మప్రతిహతం బానందలీలాపరీ
పాకం బాద్యము మల్లికార్జునపరబ్రహ్మంబు భావించెదన్.

మ. సుమబాణాంతకుఁడంచు భూతపతియంచున్ స్థాణువంచున్ గపా
లములం దాల్చినవాఁడటంచు నయినన్ లక్షింపకుండన్ స్వదే
హముఁ గూడ న్సతికొప్పగించి పరమాహ్లాదంబు నైనుండు మా
హిమవత్పుత్రికృపాతరంగములలో నెల్లప్పుడు న్డోలాడుదున్.

మ. అసమానంబగు పారిజాతమునకై యన్యోన్యమే వేళలన్
గసిదీఱంగను వాదులాడుకొనుచున్ గైలాటములు న్సభీ
ష్మసుతాసత్యలకొక్కమాఱు దరహాసస్ఫూర్తిచే నగ్రజా
స్వసృభావంబు ఘటించినట్టి రసికస్వామిన్ బ్రశంసించెదన్.

మ. శరణం బై సకలప్రపంచముల కిచ్ఛామాత్రసంసృష్టికిన్
దారంబై తావలమై మహత్త్వమునకుం బుష్పారిపుం డైన శ్రీ
హారి వక్షస్స్థలమందు నెక్కి వివిధవ్యాపారవైచిత్ర్యముం
బరికల్పించి చమత్కరించెడిమహామాయన్ప్రశంసించెదన్.

మ. మతిమంతుల్ నుతియింప నర్హ్యమగు నే
మం బొప్పంగల్గింప ను
న్నతభావంబులు సొంపునింపఁ బరమా
నందంబు దీపింప భా
రతి చిత్తంబు చిగుర్ప సత్కృతి నొస
ర్పంబూను నీవేళలోఁ
జతురాస్యుండు దయామయుండు చతురా
స్యత్వంబు నాకీవుతన్. 5

క. వాణీ వైభవవిజితేం
ద్రాణీ మాయమ్మ నలువరాణీ వీణా
పాణీ ఘనవేణీ క
ల్యాణీ నానాల్కకెక్కుమమ్మా లెమ్మా. 6

శా. మాహాత్మ్యద్యుతిసంపదాకలితస
మ్మానంబు నానావిధ
స్నేహారక్షణక్రియాకరణని
ర్నిద్రస్వరూపంబు వి

శ్వాహఃశ్లేషవిధాయకంబు గగనా
థాదిత్యబింబంబు ప్ర
త్యూహధ్వాంతము రూపుమాపి మది క
త్యుత్సాహముం గూర్చుతన్. 7

మ. అతులంబైన పదార్థవృత్తిగుణశయ్యాపాకరీతిప్రపం
చితమాధుర్యముతో నలంకృతులతోఁ జేతోవిహారస్ఫూర్తితో
శ్రుతికింపైనవిధంబుతో రసముతో శోభిల్లి పెంపొంద నా
కృతికీమూర్తమునందుఁ దప్పక హయగ్రీవుండు తోడయ్యెడున్

క. గుణములనుచు దోషంబులు
గుణములు దోషంబులనుచు ఘోషించెడు నా
గణమునకు మాటిమాటికిఁ
బ్రణమిల్లుదు నాదుకృతికిఁ బొల్పడకుండన్. 9

సీ. వాల్మీకి కాదికావ్యప్రణేతకు మ్రొక్కి
వ్యాసభట్టారకు నాదరించి
కాళిదాసుని మనఃకంజాతమున నిల్పి
భట్టబాణుని మహత్త్వము గణించి
వాగనుశాసనుఁ బ్రస్తుతించి యుభయ
కవిమిత్రునకుఁ బురస్కార మొసఁగి
శంభుదాసున కుపచారంబు లొనరించి
కవిసార్వభౌముని గారవించి

ఆ. వె. సంస్కృతాంధ్రకావ్యసంఘాతనైపుణ్య
శాలులైన యితరసత్కవులకు
భక్తిపూర్వకముగఁ బ్రణతులు గావించి
సులభమగును జిత్తశుద్ధి వడసి. 10

గ. నవనవసాహితీబంధురంబుగా నొక్కప్రబంధంబు నొనరింప
సమకట్టి దానికిం దగు పవిత్రచరిత్రం బెయ్యదియొకోయని
కుతూహలంబున నెదురుచూచుచుండు సమయంబున 11

—♦ ప్రోత్సాహము ♦—

క. ఘనులెన్న బదినహాల్ పే
రను నొకగ్రామంబు గలదు ప్రఖ్యాతిం గాం
చిన యాదవాద్రికిన్ యో
జనదూరమునందు సాధుజనవాసంబై. 12

క. శ్రీయుతుల కాకరంబగు
నాయూరు బలారిమండలాంతర్గతమై
శ్రేయముల కుపాయములకు
నాయములకుఁ బట్టుగొమ్మనా విలసిల్లున్. 13

ఉ. అందుఁ గుబేరరెడ్డియనునాతఁడు నీతివిశారదుండు పెం
పొందినభక్తితోడఁ దన కుత్సుకతన్ గలిగించుచుండి పే

నొంది ప్రసిద్ధికెక్కె నమ్మహాత్మురాలగు లింగమాంబయుం
దండముచిదముం గలిసినట్లిరుకుమారులఁ గాంచె నిర్వురన్.

క. వారు విరూపాక్షరెడ్డి శివారెడ్డి యనుపేరులు సార్థకంబు
లుగా జగదేకనాథుండగు విశ్వనాథుని సమర్చావిశేషం
బుల నలరించి సాభీష్టసిద్ధిం గాంచిరి. అందు 15

గీ. జ్యేష్ఠభావంబుఁ గని గుణశ్రేష్ఠుఁడంచు
ఖ్యాతి వడసిన యావిరూపాక్షరెడ్డి
లింగమాహ్వయయగు నిజార్ధాంగియందు
నైదుగురఁ గాంచెఁ గొమరుల నతులమతుల. 16

క. వారలలో 17

ఉ. పాండవులందు మధ్యముని వైఖరి మధ్యముఁడై జగంబునన్
నిండినకీర్తితోడ గణనీయపదంబున కెక్కె ధైర్యవం
తుండననొప్పసంగి నయధూర్వహుఁడై విలసిల్లు బుద్ధిమం
తుండగు తమ్మిరెడ్డి క్షమతో రమతో మమతోజ్ఝితాత్ముఁడై.

ఉ. బ్రాహ్మణభక్తి చిత్తపరిపాకముఁ గూర్చిన కారణంబునన్
జిహ్మములైనవాదములు సేయక సాదరభావ మేర్పడన్
బ్రహ్మవిదగ్రగణ్యులగు వారల నొద్దకుఁ జేర్చి తత్పర
బ్రహ్మవిచారమున్ వినఁగ భావము గల్గెడిఁ దమ్మిరెడ్డికిన్.

ఉ. ఈశ్వరుఁడై ప్రసిద్ధపరమేశ్వరుఁడై వినిర్జితాఖిలా
ధీశ్వరుఁడై సనాతనమునీశ్వరుఁడై సకలాధినేకలో

కేశ్వరుఁడై సిరీశ్వరమహేశ్వరుఁడై వెలుఁగొందుచుండు స
ర్వేశ్వరుఁ డిచ్చుచుండెడునభీష్టములన్నియుఁ దమ్మిరెడ్డికిన్

సీ. కట్టించె నెవ్వాఁడు ఘనమైన విశ్వేశ్వ
రాలయంబును బదిన్ హాళునందు
స్థాపించె నెవ్వాఁడు సత్రంబు పలువురు
ప్రస్తుతింపఁగ నాదవానియందు
త్రవ్వించె నెవ్వాఁడు ధర్మార్థముగఁ గడం
కను గూపములు కుప్పగల్లునందు
ఆర్జించె నెవ్వాఁ డనన్యలభ్యం బైన
గౌరవంబు ప్రజానికాయమందు

గీ. అతఁడు ధర్మప్రతిష్ఠాపనాభిమాన
పూజితాఖిలదేవతాభూసురేంద్ర
సమధికాశీర్వచోబలసముపలబ్ధ
ధనకనకవస్తువాహుఁడు తమ్మిరెడ్డి. 21

సీ. చేయించె నెవ్వాఁడు శిథిలంబులైన దే
వాలయంబులఁ బ్రతిష్ఠాస్పదముల
వేయించె నెవ్వాఁడు వివిధవృక్షములతోఁ
గ్రాలుచుండెడు మహారామములను
కావించె నెవ్వాఁడు ఘనమైనబుద్ధితోఁ
బ్రాహ్మణులకు ధర్మపరిణయములు

స్థాపించె నెవ్వాఁడు బాపురంబున రమ్య
మైనట్టి విశ్వేశ్వరాలయంబు
గీ. అతఁడు సామాన్యుఁడే మల్లికార్జునప్ర
సాదసంప్రాప్తసమధికైశ్వర్యదాన
సముపచితకీర్తిచంద్రికాసారసాంద్ర
దశదిశామండలుండగు తమ్మిరెడ్డి. 22

సీ. మల్లికార్జుననామమాధుర్యమునకన్న
నితర మాస్వాద్యమం చెఱుఁగఁ డతఁడు
శాశ్వతధర్మసంస్థాపనంబునకన్న
నితరంబు కార్యమం చెఱుఁగఁ డతఁడు
బ్రాహ్మణోత్తమపాదపంకేరుహామునకన్న
నితర మారాధ్యమం చెఱుఁగఁ డతఁడు
అర్థికాంతాప్రదానానందమునకన్న
నితర ముత్కృష్టమం చెఱుఁగఁ డతఁడు
గీ. అతని శివభక్తి యతని ధర్మానురక్తి
యతని ద్విజసక్తి యతనినిర్మాణదార్యశక్తి
జనము లేర్పడ్డఁ జూచిన వినుతి సేయ
ధాత్రి కొకరత్నమై యుండెఁ దమ్మిరెడ్డి. 23

ఆ. వె. అతఁడు పామ్మార్థికాశయం బేర్పడఁ
గా నొసఁగ్గు నొప్పదార్యమునను

చేతి కెమ్ము లేక చేయుదానంబులు
చెప్ప నెవఁడు సాహసింపఁగలఁడు. 24

క. అతనికిఁ గల రిరువురు శ్రీ
మతులగు భార్యలు కళాసమంచితలు పతి
వ్రతలు కృతపారమార్థిక
యతనలు సేవమ్మ పార్వతమ్మ యనంగన్. 25

గీ. వారిలోఁ బార్వతమ్మగర్భంబునందు
భవ్యగుణభూషణులు వీరభద్రరెడ్డి
నా హరిశ్చంద్రరెడ్డినా న్యాయమతులు
గలిగిరి కుమారు లిరువురు ఫలములట్లు. 26

గ. మఱియు వారిలో జ్యేష్ఠుండగు వీరభద్రరెడ్డికిఁ గృష్ణమ్మ పార్వతమ్మ యనునిరువురు భార్యలును హరిశ్చంద్రరెడ్డికి లక్ష్మాంబయను నొక్కభార్యయును గలదు. అందు వీరభద్రరెడ్డికిఁ గృష్ణాంబయనుభార్యయందు రంగారెడ్డియను తనూజరత్నంబుదయించె. ఇట్లు పుత్త్రపౌత్త్రాభివృద్ధిగలిగె.

క. కులములు రెంటికి వాసిన్
గొలుపఁగ శ్రీమల్లికార్జునునకు సపర్యల్
సలుపుచు నానాఁటికి వ
ర్ధిలుచున్ దనరారుఁ దమ్మిరెడ్డి ధరిత్రిన్. 28

గ. ఏవంవిధసుగుణగణోపేతుండగు తమ్మిరెడ్డి 29

క. నను సీతారామసుధీ
కనకాంబాతనయు వైదికబ్రాహ్మణవ
ర్యుని భారద్వాజసగో
త్రుని యాజుషునిఁ జిదంబరునిఁ గని వేడ్కన్. 30

గ. భక్తిపరిణామంబుఁ గావించి సాంజలినై. 31

క. మీముఖపద్మముఁ జూచిన
స్వామీ! కడు బ్రహ్మవర్చసం బగపడెడిన్
మామల్లికార్జునుండే
యీమెయి నరుదెంచెనంచు నే భావింతున్. 32

ఉ. వింటి ననేకగాథలను వీరలు వారలుఁ జెప్పుచుండఁ గ
న్గొంటి మహాచరిత్రములు గూర్చినగ్రంథము లెన్నియేని ము
క్కంటికథాప్రసంగమునఁ గల్గిన మోదము గల్గదాయె నొ
క్కంటనుగూడ నాకు శివగాథలలోని విశేష మెట్టిదో ?

ఆ. వె. ఎన్నిమార్లు విన్న నెంతపఠించినఁ
గ్రొత్తక్రొత్తచవులు గొల్పుచుండుఁ
గాని ప్రాఁతవడవు కళ్యాణగుణపరి
పూర్ణుఁడైన శివుని పుణ్యకథలు. 34

సీ. ఘటికాశతగ్రంథకల్పనప్రావీణ్య
శోభితవాగ్విలాసుండ వీవు

నవరసాలంకారకవనసామ్రాజ్యప
ట్టాభిషేకాప్తాభ్యుదయుఁడ వీవు
రాజాధిరాజవిభ్రాజమానమహాస
భాంగణస్థాపితయశుఁడ వీవు
శ్రీమన్మహీశూరభూమీశ్వరాస్థాన
కవిసింహభాగ్యసంగతుఁడ వీవు

గీ. సంప్రదాయసమాయాతసంస్కృతాంధ్ర
సాహితీజ్ఞానపరిపాకచణుఁడ వీవు
తెలుఁగునను జెప్పి హైమవతీవిలాస
మంకితంబీయుమామల్లికార్జునునకు.

క. అనుటయు మామకకృతిక
న్యను నేఁ డర్పించి మల్లికార్జునవిభు న
ల్లునిఁగాఁ గొనెడిముహూర్తం
బనుకూలంబైనదను మహానందమునన్.

— షష్ఠ్యంతములు. —

క. సనకాదిమునిసమర్చా
జనితకృపాదత్తమోక్షసామ్రాజ్యునకున్
ఘనునకమేయునకు నవం
తునకున్ శ్రీమల్లికార్జునున కాద్యునకున్.

క. దేవాదిదేవునకు సం
భావితమూర్తిత్రియాత్మభావునకు నుమా
సేవితునకుఁ గృతజగదం
డావనునకు మల్లికార్జునాధీశునకున్. 38

క. దోషజ్ఞతల్లజాంత
స్తోషణునకు దుష్టహృదయశోషణునకు గ్లౌ
భూషణునకు సకలజగ
త్పోషణున కనేకవిధమధురవేషునకున్. 39

క. విద్వజ్జనపూజితునకు
నద్వైతానందసుందరాకారునకున్
విద్వేషరహితునకు జగ
దుద్వహునకు మల్లికోత్సవోపేతునకున్. 40

క. జగదేకనాయకునకున్
భగవంతున కీశ్వరునకుఁ బరమాత్మునకున్
సగుణునకున్ నిర్గుణునకు
నగణితునకు బదినహాల్‌పురావాసునకున్. 41

గ. నాష్టాంగభక్తిపరిణామపరశ్శృతపురస్సరంబుగా నే నొనర్పం
బూనిన మహాప్రబంధమునకుఁ గథాక్రమంబు 42

# కథాప్రారంభము

సీ. సరళద్రుమామాయాతమరుదంశురాఘ్రాణ
పరవశీకృతనభశ్చరగణుండు
గంధసామజసముత్కటగర్జనాటోప
కంపితదిగ్దంతికంధరుండు
దివ్యౌషధిమహాప్రదీపప్రభాచ్ఛటా
దేదీప్యమానరాత్రిందివుండు
సప్తర్షిమండలసంగృహీతాత్మీయ
శిఖరకాసారకుశేశయుండు

గీ. యజ్ఞసాధనభూభరణార్హతాప్ర
తీక్ష్ణగానందభరసురజ్యేష్ఠదత్త
యజ్ఞభోక్తృత్వసర్వశైలాధిపత్య
శాశ్వతుం డొప్పు హిమవదద్రీశ్వరుండు.

క. అతనికి మేనక యనియెడు
సతి గల దనుకూలురాలు సాధ్వీమణి వి
శ్రుతవిమలచరిత పితృదై
వతమానసపుత్త్రి లక్ష్మివలె విష్ణునకున్,

సీ. పతిపాదపద్మసేవాసంవిధానమే
యతులితంబగు మహావ్రతముగాఁగ
ప్రాణేశ్వరాజ్ఞానుపాలనదీక్షయే
యనవద్యమగు తీర్థయాత్రగాఁగ
భర్తృసమ్మోదసంపాదనాసక్తియే
యపరిమితంబైన తపముగాఁగ
దయితశుశ్రూషావిధానతాత్పర్యమే
సమభీష్టదేవతాజపముగాఁగ

గీ. సకలజననుతిపాత్రమై జానుమీఱె
నఖిలకాంతాశిరోరత్న మనెడి పేరు
వడసి సుగుణంబులకు మేలుబంతి నాఁగఁ
జెలువుమీఱెడి మేనకాజలరుహాక్షి. 45

చ. కనుఁగొన దెన్నఁడేని కడగంటను జూడఁగరాని యన్యులన్ దు
ర్జనుల నసత్యముల్ వినదు స్వప్నమునందును నైన ధర్మవ
ర్తనమున కించుకేని జవదాఁటదు దొకప్పుఁగూడ మేనకా
వనజదళాయతాక్షి పతిభక్తిపరాయణచిత్తవృత్తియై. 46

క. హిమవంతునిఁ దక్కఁగ నా
కమలాననేత్రి పతినిఁ గనుఁగొన దతఁ డా
కమలాక్షిఁ దక్కఁగ మఱియొక
ప్రమదామణిఁ గాంచఁబోఁడు బహునిష్ఠమెయిన్. 47

క. వారిరువురు శోకపరిదు
ర్గారాధన సేయుచుండ నప్పుడు తమకా
గౌరియె తనూజగా సమ
కూరవలయునను చు నొక్కకోరిక పుట్టెన్. 48

ఉ. అంతటఁ గొన్నినాళ్లకు హిమాచలమౌళిమనంబునందు న
త్యంతకుతూహలంబుదయమందమహేంద్రముఖాదితేయులం
దింతనరానిమోదమున నెంతయు నింపెసలార మేనకా
కాంతకు గర్భమాయె శితికంఠతపఃపరిపాకమోయనన్. 49

ఉ. ఆరమణీలలామకుఁ గటాక్షములందొకతీరు క్రొత్తశృం
గారము మొల్కలెత్తె నుడికారములందును బోలె నానవాం
భోరుహపత్రనేత్రికి నపూర్వవినోదములందుఁ బోలెఁ జే
కూరనియట్టివస్తువులఁ గోరికలీరికలెత్తె నత్తఱిన్. 50

ఉ. ఆనళినాయతాక్షి ప్రమథాధిపురూపముఁ గాంచ నెంచు నా
ఛావ సుధాంశుమౌళి కుపచారము సేయఁగఁ గోరు నాసరో
జానన రాజతక్షితిధరాగ్రము నెక్కుట కిచ్ఛగించు నా
మేనక శర్వుఁడన్నఁ బ్రీణమిల్లు శివార్ధము లోననుండుటన్.

ఉ. ఆరమణీయగాత్రికి విహారములట్లు రుచింపవాయె నా
హారము లాలతాంగి కడు గామడగాఁ గనుపట్టె నామనో
హారిణి కాత్మజాసురుచిరాస్యనిరీక్షణవాంఛవోలె పెం
పారెను గర్భలక్షణము లంతకునంతకు వింతవింతగన్. 52

గీ. అఖిలజగదేకసార్వభౌమార్ధదేహ
కలితనూతనసౌభాగ్యకళలతోడ
నంతకంతకు నాకాంత కధికమగుచు
నిండె గర్భంబు తననోము పండినట్లు. 53

క. అప్పుడు నారదుఁ డనియెడు
గొప్పమునీశ్వరుఁడు వచ్చి కోమలికిం బెం
పొప్పఁగ శివమాహాత్మ్యముఁ
జెప్పెన్ గర్భస్థమైన శిశు వాలింపన్. 54

క. అప్పగిది బ్రహ్మతనయుఁడు
చెప్పఁగ గర్భముననుండుశిశు వదియెల్లన్
దప్పక విని పరమేశ్వరు
నప్పుడ వరియించెఁ దనకుఁ బ్రాణేశ్వరుఁగాన్. 55

గ. అంత నారదుండు నిజాగమనప్రయోజనంబు నెఱవేర్చి
కొని దేవతాకార్యంబు పండెనని యంతరంగమున సంత
సించుచు మేనకకు సుఖప్రసవంబగునట్లాశీర్వదించి యథే
చ్ఛముగఁ జనియె నంత

## —♦ హైమవతీజననము ♦—

సీ. బర్హిర్ముఖులు పుష్పవర్షంబుఁ గురియింప
నప్సరోంగనలు నృత్యంబులాడ

గంధర్వకన్యలు గానంబుఁ గావింప
బ్రహ్మర్షిగణము దీవనలుసలుప
వందిమాగధులు కైవారంబు లొనరింప
శుభదైవతంబులు శుభము వలుక
శోభనగ్రహములు సుక్షేత్రముల నుండ
ధర్మంబు నాల్గుపాదముల నిలువ
గీ. దిక్తటంబులు కళలచేఁ దేజరిల్ల
భువనమంతయు విమలమై పొలుపుఁ జెందఁ
గలశవారాశిలో లక్ష్మి గలిగినట్లు
గౌరి జన్మించె మేనకాగర్భమందు. 57

క. ఆనందఖేలనము లస
మానవినోదములు వివిధమంగళతూర్య
ధ్వానంబులు జయజయని
స్వానంబులు వెలసె నాకసంబున నెల్లన్. 58

క. కల్లరితొలువేల్పులతోఁ
బల్లటపడు జగము చల్లవడు నిఁక నన్నం
ట్లల్లిక బిల్లిక గొనుచున్
జల్లని తెమ్మెరలు చల్లచల్లఁగ వీచెన్. 59

క. అంతట సంతసమున హిమ
వంతుం డుత్సవముఁ జేసె బాలిక కెంతో

వింతగ యాచకజనముల
కింతంతనరాని ద్రవ్య మిచ్చుచు నిచ్చన్. 60

క. ఆమోదంబున పూని
గ్రామము లెల్లరునుగూడి కన్యామణికిన్
నామకరణంబుచేసిరి
హైమవతి యటంచు హిమవదాత్మజ యగుటన్. 61

గ. అంత నా హైమవతి ప్రతిపచ్చంద్ర రేఖంబోలి జగంబున
కమందానందముం గొల్పుచు నాఁడునాఁటికిఁ గ్రమక్ర
మంబున 62

## —♦ హైమవతీబాల్యము ♦—

సీ. భర్గునకీలీలఁ బ్రణమిల్లు ననునట్లు
లల్లనల్లన బోరగిల్ల నేర్చె
పరమేశు నీరీతి దరిసించు ననునట్లు
క్రొత్తక్రొత్తగఁ దలయెత్త నేర్చె
శివుని దేహంబట్లు చేకొను ననునట్లు
మెల్లమెల్లన నొత్తగిల్ల నేర్చె
హరునితో నిట్లు లాల్లోపించు ననునట్లు
చివ్వచివ్వన నవ్వునవ్వ నేర్చె

గీ. ఉగ్రుఁ బూజించునట్లు కూర్చుండ నేర్చె
మృడుని యొద్దకుఁ జనునట్లు నడప నేర్చె

భవునిఁ గీర్తించునట్టులు పలుకనేర్చె
ముద్దులొల్కుచునుండు నాముద్దుగుమ్మ. 63

క. తడబడెడుమాటలాడుచు
మృడయను నొకమాఱు మఱియునే మేమేమో
నుడువఁదలఁచి శివశివయనుఁ
గడకాగిరిరాజకన్య కడుబాల్యమునన్. 64

క. అక్షరములు పలికించెడి
పక్షంబున నోంనమశ్శివాయ యనుచుఁ దా
నాక్షణమ పలుకు నాహరి
ణేక్షణ పలుమాఱుఁ బూర్వకృతపుణ్యమునన్. 65

సీ. బొమ్మలపెండింద్లు పొనరించువేళలో
హరునిబొమ్మను బెట్టి యాటలాడు
గుజ్జెనగూళ్లు గైకొని తినువేళలోఁ
గృత్తివాసుని నారగింపఁజేయు
గొనజైనవేసంబులను దాల్చువేళలో
శివునివేషముఁ దాను స్వీకరించు
చెలువైనముద్దుపాటలఁ బాడువేళలో
భవునిపాటలు దాను పాడుచుండు

గీ. సకియ లేకార్యములనేని సలుపుచున్నఁ
దానుగూడను నొనరించి దాని ఫలము

నంతయు శివార్పణము సేయు నామెపూర్వ
జన్మసంస్కారమెంతటి శక్తిగలదొ! 66

సీ. అదిచేయుమనినచో నదిచేయునేకాని
యదియేమియంచుఁ దా నడుగఁబోదు
ఇదిచేయుమనినచో నిదిచేయునేకాని
యిదియేమియంచుఁ దా నెఱుఁగఁబోదు
అదిమానుమనినచో నదిమానునేకాని
యదియేమియంచుఁ దా నడుగఁబోదు
ఇదిమానుమనినచో నిదిమానునేకాని
యిదియేమియంచుఁ దా నెఱుఁగఁబోదు

గీ. చిత్తమంతయుఁ జేరిచి శివునిమీఁద
నవయవములెల్ల సకియల కప్పగించి
భూధరాత్మజ దాఁ దోలుబొమ్మరింటి
నాటపాటలతోడ బాల్యంబుఁ గడపె. 67

గీ. మేనకాగర్భమునయందు మెలఁగుచున్న
సమయమున బ్రహ్మపుత్త్రుఁడు సలిపినట్టి
పరమతత్త్వోపదేశంబువలన సకల
విద్యలామెకుఁ జదువక విదితమయ్యె. 68

గ. అంతఁ గొంతకాలంబునకు. 69

## హైమవతీయౌవనము

గీ. వనముపాలిటి కాముని వచ్చినట్లు
పాలుపుగలతీఁగియకుఁ బూవుపూచినట్లు
పూవునకు వింతయగు తావి పొలిచినట్లు
యౌవనము ప్రాప్తమాయె నాయద్రిసుతకు. 70

గీ. ఇందుగుణములు పద్మంబునందు లేమి
నబ్జగుణములు చంద్రునియందు లేమి
ద్వితయమును వీడి లక్ష్మి తద్ద్విగుణభరిత
మైన యాలేమ యాననమందుఁ జేరె. 71

గీ. మధురకంఠంబుతోడ నామధురవాణి
యమృతములుచిప్పిలెడుమాటలాడుచుండ
లలితకోకిలకాకలీకలకలములు
విషమతంత్రిస్వరములట్లు వెగటులయ్యె. 72

గీ. అమృతకిరణునిలోనుండు నమృతరసము
మెఱపుఁదీవెలలోనుండు మెఱుఁగునిగ్గు
కలిపి కరఁగించి తేలిన తళుకుతోడఁ
జలిపినట్లుండు నాశైలజాతమేను. 73

సీ. హరిమధ్య క్రేఁగన్ను పరఁగించుటకు మున్న
యడవులపాలాయె హరిణగణము
కరియాన పదములు కదలించుటకు మున్న
నీరజషండంబు నీటఁ బడియె

చంపకనాస కైశ్యము జార్చుటకుమున్న
భ్రమియింపఁదొడఁగెను బంభరములు
రామాంగి యొకమాట రానిచ్చుటకుమున్న
యాకులు తినఁజొచ్చెఁ గోకిలములు
గీ. ఏమిచెప్పుదునింక నాకోమలాంగి
లలితమాధుర్యరేఖావిలాసగరిమ
తేనియలతేట కపురంపుదీవికోట
పాలలోనూట యా రతనాలమూట. 74

గీ. చారుయౌవనసౌభాగ్యసముపలబ్ధ
నవనవకళావిలాసవైభవముతోడ
నంతకంతకు నెంతేనివింతయగుచు
నాలతాతన్వి లావణ్య మతిశయిల్లె. 75

సీ. కంటికి నేదేని కనఁబడెనన్నచో
నష్టమూర్తి చరిత్రలనుగఁదలఁచు
వీనుల కేదేని వినఁబడె నన్నచో
శర్వుని పేరంచు సంభ్రమించు
తనువున కేదేని తాఁకినదన్నచో
పరమేశుఁడని పారవశ్య మొందు
ఎడఁదలో నేదేని పొడకట్టెనన్నచో
హరునిరూపమటంచు నాదరించు

గీ. ఎవ్వ రేమన్న శివగాథయే యటంచు
సిగ్గుపాటున నొక్కింత శిరమువాంచు
భావనారంభసంరంభహావభావ
సముదితానంగలీల యా విమలశీల. 76

సీ. భవునిరూపముఁ జిత్రఫలకంబుమీఁదను
నచ్చులోపలఁ దీర్చినట్లు వ్రాయు
వ్రాసి మోహావేశపారవశ్యంబున
నొకమొగి గన్నార్పకుండఁ జూచు
చూచి వాఙ్మానసాగోచరంబైన సం
తోషవిశేషంబుతోడ నవ్వు
నవ్వి భక్తిప్రధానంబైన సంభ్రమా
వేగవిస్ఫూర్తితోఁ గౌఁగిలించు

గీ. కౌఁగిలించి యిదేమని కళవళించుఁ
గళవళించిన సిగ్గున నిలువరించు
నేమిచెప్పుదునింక నాయిందువదన
చిత్త మంతంత కేశ్వరాయత్తమయ్యె. 77

క. నేర్పున నయ్యువలోచనసం
తర్పణముం జేయఁజాలు తనరూపంబుఁ
దర్పణమునందుఁ జూచి శి
వార్పణమను నామె కెంత యానందంబో ! 78

క. చెలియలు రమ్మనిపిలిచినఁ
బలుకదు మాటాడ దద్రిపతిపుత్త్రి విని
శ్చలభావనావిశేషా
కలితానందార్ణవావగాహన యగుచున్. 79

గీ. చంద్రమౌళీయటంచు నీశాయటంచు
వామదేవాయటంచు శివాయటంచు
నాడుచుండు జాగ్రద్దశయందుఁబోలె
నిదురవోవుచుఁగూడ నానీరజాక్షి. 80

సీ. అదె చూడుమనఁబోయి హరుఁ జూడుమను నొక్క-
వేళలో మానసాందోళనమున
సకియ రమ్మనఁబోయి శర్వ రమ్మను నొక్క-
వేళలో భావనాందోళనమున
చివురుఁ దెమ్మనఁబోయి శివునిఁ దెమ్మను నొక్క-
వేళలో భాషణాందోళనమున
తాళలేననఁబోయి శూలి రాఁడను నొక్క-
వేళలో సంభ్రమాందోళనమున

గీ. పంచబాణశిలీముఖపటలచటుల
పటుతరాఘాతవిఘటితపరమధైర్య
కవచదుర్బలహృదయసంభవదుదగ్ర
విభ్రమాయత్తయగుచు నావెలఁదిమిన్న. 81

—♦ మేనకాహిమవద్విచారము ♦—

శా. ఆకన్యామణి వేషభాషణము లత్యాశ్చర్యముం గొల్పఁగా
నాకర్ణించి నగేంద్రమేనకలు చింతాక్రాంతచేతస్కులై
యీకళ్యాణి కెవండు భర్తయగునో యేనాఁటి కస్మన్మనో
వైకల్యంబు తొలంగునో విధిపరీపాకంబదెట్లున్నదో. 82

క. హరునిపయిఁ దనమనోరథ
మిరవుకొనం జేసికొనియె నీయమ యోగీ
శ్వరులకును లభింపని యా
హరుఁ డేవిధినేని ప్రాప్తమగునే తనకున్. 83

క. ఈశ్వరుఁడఁట తనకఁట పా
లేశ్వరుఁడఁట యెంతమాట యితరుఁడె యాస
ర్వేశ్వరుఁడు తాను గోరఁగ
విశ్వంబున నెందు నిట్టి వెఱ్ఱులు గలరే. 84

క. ఎక్కడిశివుఁ డెక్కడిమన
మెక్కడ స్వర్గంబు నక్కయెక్కడ నేమీ
వెక్కురుమాటలు దీనికిఁ
దక్క మఱెవ్వరికినైనఁ దలకొనునొక్కో. 85

క. అనుచు ననేకవిధంబులఁ
దనుఁగూర్చి తలంచుచుండఁ దరుణాంబున నొ
య్యన వచ్చి చూచి జననీ
జనకుల నాబాల కడు విచారముతోడన్. 86

శా. అమ్మా నీవును దండ్రియున్ మిగులఁ జింతాక్రాంతులైనట్టులా
స్యమ్ముల్ చూచినఁ దోఁచుచున్నది గదమ్మా మీరలీరీతి దై
న్యమ్మొందన్ గతమేమి చెప్పుమన మేనాదేవి తా నామెయూ
ర్ధమ్మున్ మాఱొక్కనికంట బాష్పజలధారల్ జాఱఁగా నిట్లనున్

ఉ. పెంచితిమింతదాఁక నినుఁ బెద్దను జేసితి మింక మీఁద నే
కొంచెమొ గొప్పయో సుఖముగొల్పెడి పాత్రున కేనికైన న
ర్పించెదునట్టి భారము తరించుట యెన్నఁటికో యటంచుఁ జిం
తించుచు నుంటిమమ్మ! జననీజనకుల్ గద కన్య కేడ్గడల్. 88

—♦ హైమవతీమేనకాహిమవత్సంవాదము ♦—

మ. అనుడున్ సిగ్గొకవంకకున్ బరిణయా
హ్లాదంబు వేఱొక్కనై
పునకున్ లాగుచునుండ నాత్మహృదయం
బు న్నిల్పలేకయ్యెడన్
జననీకర్ణపుటంబునందు శివమం
త్రంబట్టు లీలీల నా
వనజాతాక్షి 'శివంవృణోమి' యనుచున్
బల్కెన్ రహస్యంబుగాన్. 89

క. ఆముగ్ధవచనమాధు
ర్యామోదము తనకు మిగుల హ్లాదము గొలుపం

గా మేనక మురియుచు నా
కోమలిని గవుంగిలించికొని యిట్లనియెన్. 90

క. ఎవ్వరు బోధించిరి నీ
కివ్విచిత్రతలంపు లిట్టివెందుం గలవే
నవ్వులఁజేటు కొమ్మా నీ
వెవ్వండని తలఁచికొంటివే శివుఁడన్నన్. 91

క. శాశ్వతుఁ డకారణుఁడు పర
మేశ్వరుఁ డితరానవాప్యుఁ డిచ్ఛాసర్గా
ధీశ్వరుఁడు నిర్వికల్పుఁడు
విశ్వాతీతుం డతండు వింటివె బాలా! 92

క. ఈడా వచ్చినదిఁకఁ బూఁ
బోఁడీ! దూరప్రసంగములకేగక మా
ఆడక మాకన్నులకున్
వేడుక గలిగింపుమమ్మ విను మాయమ్మా! 93

శా. వింతల్ వింతలుగాఁగఁ బుత్త్రికలకున్
బెండిండ్లు పేరంటముల్
సంతోషంబునఁ జేయుచుండెడి గృహ
స్థవ్రాతమున్ జూచుచు
న్నంతన్ నీకెపు డిట్టు లుత్సవము సే
యంగల్గునో యంచు మా

స్వాంతంబందును బొంగిపొర్లెడి మహో
త్సాహంబు మాతల్లిరో. 94

శా. మాన్యంబైనవివాహవేషములతో మాముందు కన్యేందుగా
నన్యోన్యంబును జెట్టవట్టికొని యాహ్లాదంబుమైనున్నడన్
గన్యారత్నమునల్లునిం గనుఁగొనంగా నుండుమాకోర్కి సౌ
జన్యంబొప్ప ఫలింపఁ జేయుట ప్రశస్తంబమ్మ! మాయమ్మరో!

క. అనుటయు నాకన్యామణి
విని తద్వచనంబులెల్ల వెగటుగఁ దోఁపన్
జననీజనకులయెదుటన్
దన నిశ్చయమేర్పఱింపఁదలపడి యంతన్. 96

మ. సులభుండైనను దుర్లభుండయిన నాశుద్ధాంతరంగంబునన్
గలవాఁడే పతిగాని నాకు మఱియొక్కండెన్నఁడుం గాఁడు వాఁ
డు లభింపండనియందు వేని దొరకండో వేయిజన్మాంతరం
బులకైనన్ దనపై మనంబునఁ దపంబున్ జేసి మెప్పించినన్.

క. శాశ్వతుఁ డనియును మఱిఁ బర
మేశ్వరుఁడనియును బ్రసిద్ధికెక్కిన నాప్రా
ణేశ్వరుని విడిచి యన్యుని
నశ్వరుని వరింపుమనుట న్యాయంబగునే? 98

క. మనసొకనికిచ్చి మఱియొ
వ్వని నేనియు నొరుని జెట్టవట్టుటకంటెన్

వనితలకు బ్రహ్మచర్యం
బున నుండుట పరమధర్మముగ భావింతుర. 99

గ. అనవుడు హిమవంతుండు దిగులుపడి నొగులు హృదయం
బునం బొగులు వేదనాగ్ని నాపికొనంజాలక బాలికామ
ణిం గనుంగొని పుత్త్రీ! నీవిట్లు సాహసించుట భావ్యంబు
గాదు. కానకకానక పెక్కువర్షంబులకు దుర్గాప్రసాదంబున
నిన్నుం గాంచితిమను హర్షంబున నుప్పొంగెడిమాకుదుఃఖ
ముంగూర్పకుము. అమ్మా! నీకీమనోరథార్థంబుదుర్లభంబు.
వత్సా! బ్రహ్మచర్యంబు నవలంబించి నవయుచున్ననిన్నుం
గాంచినమాకు నిద్రాహారంబులురుచియించునే? తల్లీ! వేన
వేలు వర్షంబు లనశనవ్రతంబునఁ బంచాగ్నిమధ్యంబునం
దపించెడి వారికింగూడ నగోచరుండగు నప్పరమేశ్వరుండు
నీకు గోచరించునే? అసంఖ్యాకంబులగు వ్రతంబులు గా
వించియు నసాధ్యంబులగు తీర్థంబులు సేవించియు నియమ
శృంఖలానిబద్ధంబులగు కర్మంబులనుష్ఠించియు నపరిమిత
నిష్ఠాగరిష్ఠభావంబున యోగంబులభ్యసించియు నప్పరా
త్పరుని తత్త్వంబుఁ దెలియంజాలక విలపించుచుందురు.
కుమారీ! సుకుమారాంగివగు నీకామార్గంబు సుగమంబు
గానేరదు. నామాట విను మనుటయు

క. అనగతనూజ యాతటి
లోన సదాశివుని మనసులోపల ననుసం

ధ్యానించి మహానందా
దీనయగుచు మఱచి ప్రకృతవృత్తము నెల్లన్. 101

సీ. చంద్రశేఖరపాదజలజాతముల నంటి
కళలీనకుండెడి కరము లేల
విశ్వేశ్వరాకారవిభవంబు వీక్షించి
సంతసింపని విలోచనము లేల
హరభాషణ కర్ణనానందముం జెంది
వికసింపకుండెడి వీను లేల
సర్వజ్ఞగాత్రసంస్పర్శంబు గాంచి
దీప్యమానముగాని దేహ మేల
గీ. సకలజగ దేకనాయక సార్వభౌమ
పర్వబిరుదాంకభూషణ ప్రమథనాథ
బహుళసేవావిధానసంప్రాప్తపరమ
సౌఖ్యపాథోధిఁ దేలని జన్మ మేల. 102

క. అని పలుకుటయు నతం డే
మనుటకు నోరాడ కల్లనల్లన మేనా
వనజాయతాక్షి యౌవన
ముఁ గనుఁగొని యూరకుండె మునిచంద్రమునన్. 103

గ. అంత నా మేనకా కాంత పుత్త్రికామణి నాలోకించి. 104

ఆ. వె. చిన్నదానవగుటఁ జెప్పెడిమాటలో
నర్థ మెఱుఁగవైతి వంతె కాని

యమ్మహేశ్వరునకు నబల! నీకును గల
యట్టి తారతమ్య మరసికొంటె? 105

ఆ. వె. పర్ణసలిలవాయుభక్షణంబులతోడ
నలసిసొలసి నవయునట్టివాహ
ఫ్రానఁదగినకార్యమున కీవు ఫ్రానుట
కన్న వేఱ మూర్ఖ్య మున్నె యబల! 106

గీ. మానులకునైనఁ జిక్కని వానిపైని
గోలవగు నీకుఁ గలిగిన కోర్కి చూడ
నందరానిఫలంబును నందికొనఁగ
నెగిరి పడు వామనుని ఫ్రాన్కి పగిదిఁ దోఁచె. 107

క. కొనసాగనికోర్కులతోఁ
బని యేమగు నిరుగుపొరుగువారలు విన్నన్
మనకిడిపరిహాసంబని
యనుకొనవిది యేటి పాపమమ్మా యనుచున్. 108

క. మనసిచ్చి మాటలాడక
జననీజనకులకు మ్రొక్కి సత్వరముగ నా
వనజాయతలోచన వ
చ్చినత్రోవం జనియె మరల స్థిరచిత్తముతోన్. 109

(తరళ.)

విదళితత్రిపురాసురాభినివేశ తత్త్వవిచారక
హృదయసద్మనివాససౌఖ్యసమీహితాత్మ నిజాశ్రితా
భ్యుదయదాననిబద్ధకంకణ భూరివైభవ విస్ఫుర
ద్బదినహాల్ పురమల్లికార్జున పాపబంధవిమోచనా! 110

గద్యము.

ఇది శ్రీమత్పరమపవిత్ర భారద్వాజసగోత్రాపస్తంబసూత్ర
సీతారామపుత్ర కనకాంబాగర్భశుక్తిముక్తాఫల పరమేశ్వర
ప్రసాదసముపలబ్ధసుకవితా భాగధేయ శతావధాన
విధానధౌరేయ కావ్యకలానిధి చిదంబరనామ
ధేయ ప్రణీతంబగు హైమవతీవిలాసం
బను మహాప్రబంధంబునం
బ్రథమాశ్వాసము.





# హైమవతీవిలాసము

## ద్వితీయాశ్వాసము

క. అతులానుభావ! నిగమ
ప్రతిపాదితనిరుపమప్రభావా! యంగీ
కృతసజ్జనసేవా! విని
హతదుష్కృతభావ! మల్లికార్జునదేవా!

—♦ హైమవతీసంతాపము ♦—

గ. అంతకంతకు మిక్కుటంబగు తమకంబున నాపర్వతరా
పుత్త్రి భుజామృణాళికల మీఁదికిఁజాఁపి యాకసమునందు
కొనఁగడంగుచుండ నది చూచి యొక్కవయస్య.

క. చెలియా యేమిది నీవా
తులపడియెదు వ్యోమమందుకొనఁగఁ దెఁగెద వి
ట్టులు దెలివిదప్పిపోయినఁ
బలుచఁదనముగాదె చూచువారలు కనినన్.

వ. అంత నాకాంతాలలామంబు 4

క. ఇందుధరుం డందముతో
మందస్మితకలితలలితమాధుర్యముతో
ముందఱ నిలువంబడి నా
కందినయట్లుండి మరలనందఁడు కంటే ? 5

క. ఆనిర్మల తేజం బా
యానందరసాతిరేక మామాధుర్యం
బానవమోహనవిగ్రహ
మానయనఫలంబు విడువనగునే మగువా ! 6

వ. అనిపలుకుటయు మఱియొకసఖి యాయమకుఁ బ్రియముం
గూర్చు తలంపున 7

క. అమ్మా ! యిందుధరుండెవఁ
డమ్మా ! నీ వెట్లు వలచితాతనిఁ దద్వృ
త్తమ్మున్ నా కెఱిఁగింపుము
కొమ్మా ! సమకూర్తు నెట్టి కోర్కులనైనన్. 8

వ. అనిభాషించిన నాయోషామతల్లి 9

గీ. గర్భవతియైన మాతల్లి కడకు వచ్చి
చంద్రశేఖరుఁడగువాని చందమెల్ల
బ్రహ్మపుత్త్రుఁడు చెప్ప గర్భముననుండి
వింటిఁ బులకాంకురంబులు వెలయ మేన. 10

క. అదిమొదలు వానిపై నా
హృదయము సంలగ్నమయ్యె నేమందు సఖీ
వదలుమనిన వదలదు నా
హృదయేశ్వరుఁ డేమిచేయ నెంచినవాఁడో? 11

క. ఆతని వృత్తము చెప్పఁగ
నేతన్మాత్రులకుఁదరమె యెది యెట్లైనన్
బ్రీతిజనించెడుఁగావునఁ
జేతమునకుఁదోఁచినట్లు చెప్పెద వినుమా. 12

గ. ఆతండు పరమపురుషుండు. ఆతని కనేకనామంబులుగలవు. ఆపరమేశ్వరునివలన జగంబులు సృజియింపఁబడి నిలుపంబడి ప్రళయంబు నొందింపఁబడుచుండు. ఆమహాదేవుండు సృష్టిస్థితిప్రళయకర్తృత్వంబుఁ దాల్చియు నకర్తయై జీవరూపంబున ననేకకోటిదేహంబులం బ్రవేశించి సర్వభోక్తృత్వమ్మునొందియు నభోక్తయై కార్యకారణరూపంబులం దాల్చియు నక్రియుండై యఖిలకర్మంబుల కాశ్రయుండయ్యు నిష్కర్ముండై గోచరత్వంబుఁబడసియు నగోచరుండై దూరగతుండయ్యు నదూరగతుండై యవికారుండయ్యు సవికారుండై గుణరహితుండయ్యు గుణసహితుండై నిస్సంగుండయ్యు ససంగుండై నిరంజనుండయ్యు సాంజనుండై సచ్చిత్ప్రకాశరూపంబులఁ బ్రత్యక్షంబుగా జగంబుల వెలుంగుచుండువాఁడై తేజంబులకెల్ల నాదితేజంబై

రూపంబులకెల్ల నాదిరూపంబై మధురంబులకెల్ల మహా మధురంబై వస్తుజాతంబులకెల్ల నాదివస్తువై యసాధ్యంబై సాధ్యంబై యప్రాప్యంబై ప్రాప్యంబై బ్రహ్మాండసందోహంబుల నిండియుండు నాయనిర్వచనీయ శక్తిసంపన్నుని చరిత్రంబువచియింప నేనెంతదాన. ఆపరమపురుషుని నీవు నాకుంగూర్పఁగలవే? యని నవ్విన నాచెలియలందఱును విస్మయంబొంది యమ్మా! యావిచిత్రచరిత్రుని సాధింపఁ దెరువెయ్యదియో మాకు గోచరింపకున్నయది నీవే ప్రబోధింపుమనుటయు 13

మ. అపరిచ్ఛేద్యుఁడు నిర్వికారుఁడగు నాయాత్మేశు సాధింపఁగన్
దపమే సాధనమంచు మున్న తెలిపెన్ మానీశ్వరుండంచు నా
తపనీయాంగి వచింప నాసకియ లత్యానంద మేపారఁగాఁ
దపము జ్జేయఁగ రాదె నీవనుచుఁ బ్రోత్సాహంబు గావించినన్.

క. అమ్మాయి నపరిమితానం
దమ్మొబుకుచునుండఁగా హృదయమందున్ శ్రీ
ఘ్రమ్ముగ శుభమగునను చం
దమ్మున నాయమకు వామనయనంబదరెన్. 15

— హైమవతీతపశ్చరణము —

గ. అంత నాకోమలాంగి 16

క. మనసే కారణ మన్నిటి
కని యో కానలకు నతివ లరుగుట గర్హ్యాం

బనిరో హిమవత్కందర
మునసే తాఁదపముసేయు పూనికతోడన్. 17

గ. కతిపయసఖీసమేతయై తత్పురిసరంబుననుండు గంగానదిం
గ్రుంకి వివిక్తంబగు నొక్కకందరంబుదరిఁ జేరి నియమిత
చిత్తయై పరమేశ్వరారాధనదీక్షం గైకొననెంచి పారమార్థి
కచింతనావసరంబునఁ దుచ్ఛంబులగు నైహికభోగంబు
లాసింపరాదని ప్రబోధించుచున్నట్లు 18

సీ. తళతళలాడు ముత్యాలహారముఁ దీసి
యఱుతఁ దాలిచెను రుద్రాక్షమాల
బుగబుగలాడు కప్పురపుగందముమాపి
మైపూఁతగాఁగ భస్మంబుఁబూసె
అందంబులైన చీనాంబరంబులు పాఱ
వైచి మేన ధరించె వల్కలములు
మేలైన మాణిక్యమేఖల విడనాడి
కటితటంబునఁ దాల్చెఁ గఠినమౌంజి

గీ. లౌకికములైన మధురసల్లాపములను
మాని పంచాక్షరీసార మానఁదొడఁగె
బ్రహ్మసూనుప్రబోధసంప్రాప్తసకల
నియమసారజ్ఞయగుట నానీరజాక్షి. 19

సీ. పరిమితిలేని సంపద లుండియునుగూడఁ
గలనైన నొక్కింత గర్వపడదు

భ్రమియింపఁజేయు యౌవన ముండియునుగూడఁ
గన్నెత్తి పురుషులఁ గాంచఁబోదు
గణియింపరాని భోగము లుండియునుగూడ
ననుభవింతమటంచు నాసపడదు
వాంఛలీడేర్చు దేవత లుండియునుగూడఁ
గోర్కి యొక్కండేని కోరఁబోదు

గీ. శంకరారాధనైకనిష్ఠాగరిష్ఠ
హృదయసంజాతసాత్త్వికాభ్యుదయలబ్ధ
శాశ్వతానందపదసమాసాదితాఖి
లార్థవైరాగ్యధన్య యాయద్రికన్య. 20

క. చలినట్టు వీచుచుండఁగ
నెలవెన్నెల గాయుచుండ నిలువున నీరై
వలిగొలిపెడు తుహినశిలా
ఫలకములే పఱుపులాయెఁ బద్మాననకున్. 21

గీ. పడకపైఁ జల్లినట్టి పుష్పములచేతఁ
గూడఁ గసుగందిపోవు నాకోమలాంగి
చేయి తలక్రింద దిండుగాఁ జేసికొనుచుఁ
గఠినమగు ఱాలపై రేలు గడపుచుండె. 22

గీ. నియమభంగభయంబుచే నీలవేణి
తన విలాసంబులను లతాతతులయందుఁ

దన యపాంగంబులను మృగాంగనలయందు
నుంచినట్టులు చూడఁగా నొప్పె నపుడు. 23

గీ. వ్రతము ఫలియించి తనకుఁ గపర్ది వేష
మప్రయత్నంబుగాఁ బ్రాప్తమైనయట్లు
సంపరిత్యక్తతైలసంస్కారమైన
పడఁతి కేశకలాపంబు జడలుగట్టె. 24

గీ. ఆమెయాననము శిరోరుహములవలన
నొప్పినట్టుల జటలచే నొప్పియుండెఁ
దుమ్మెదలచేతనేకాక తమ్మిపూవు
చెలువమగుఁగాదె జలనీలివలనఁగూడ. 25

గీ. ఇంతి నాసాగ్రమున స్థిరదృష్టులుంచి
పరమనిష్ఠాగరిష్ఠభావమున నుండ
నుత్పలంబులు సంపంగి నొక్కమొగిని
జాతివైషమ్యమునఁ జూచు చాయఁదోఁచె. 26

గీ. సహజమధురాంగియైన యా శైలపుత్రి
వల్కలముఁ గట్టుకొనియు శోభను వహించె
శైవలావృతమైనను సరసిజంబు
కనులపండువుసేయదే కనుఁగొనంగ. 27

గీ. కందుకక్రీడఁ గావింపఁ గందిపోవు
కలికి కరములు దర్భసంఘర్షణమున

కౌఁగియుండుటఁ జూడఁ డైక్ష్ణ్యంబుగూడ
మృదుపదార్థంబునందుంట విదితమయ్యె. 28

గీ. ఆహా పంచాగ్నిమధ్యమునందు నిలిచి
తీక్ష్ణకరునిఁ దదేకాగ్రదృష్టితోడఁ
గాంచుచుండఁగ వదనపంకజమునందు
నంతకంతకును వికాస మలిశయిల్లె. 29

గీ. మెఱుఁగుఁదీవియఁబోలు నామెలఁత మేను
పరమఘోరతపోవృత్తిపాలఁ బడియు
సొంపునింపెడి కాంతితోఁ జూడనొప్పెఁ
జండకరతప్తమగు సరోజాతమట్లు. 30

గీ. వాయుభక్షణమాత్రమువలన జీవ
ములకు నొకకొంత జీవము నిలుపుచుండు
నామె తనువెల్ల సగమయ్యె నంతనంత
శివుని దేహంబులోఁ బోయి చేరినట్లు. 31

గీ. పర్ణనివృత్తిని నుండు సమయమునందు
మాంసమంటుట పాపకర్మంబటంచుఁ
దలఁచి తత్స్వర్శరహితమై నిలిచెననఁగఁ
జెలువ నెమ్మేను ఛాయావశిష్టమయ్యె. 32

గీ. తనకుఁగాకుండె లోకబాంధవుఁడు బంధు
వను కలంకము పోఁగొట్టికొనఁదలంచి

యతని కెదుటఁ దపించుచున్నట్లు దోఁచె
నువిద కన్నుల నెపమున నుత్పలములు. 33

గీ. ఎంతకృశియించినసుగాని యింతి మేన
నంతకంతకు లావణ్య మతిశయిల్లె
జగతి ధీరున కెన్నికష్టంబు లేని
వచ్చినకొలంది ధైర్యము హెచ్చినట్లు. 34

చ. ఫలములఁ గొన్నిప్రొద్దులును
బర్ణములన్ మఱికొన్నినాళులున్
జలముల వేఱ కొన్నిదివ
సంబులు వుచ్చి క్రమక్రమంబుగాఁ
జలనము గల్గకుండఁగను
శ్వాసములాఁపుచు నొంటికాలిపై
నిలిచి తపంబుఁ జేసె ధర
ణీధరనాయకపుత్రి దీక్షతోన్. 35

సీ. చేడె లాహారంబుఁ జేతికిచ్చుచునున్న
గ్రహియింపనేర దాకంజపాణి
చెలులు దగ్గఱఁ జేరి పలుకరించుచున్న
మాటాడఁబోవ దామంజువాణి
భోటు లబ్బురముగా నాటలాడుచునున్నఁ
గన్నెత్తి చూడ దా కలువకంటి

సకులు వేడుకతోడ నాలపించుచునున్నఁ
బెదవి కదల్ప దావిద్రుమోష్ఠి

గీ. కుంజరస్థానమండితాఖండరూప
చంద్రికాసారసముదయాస్వాయదమృత
పానలబ్ధమహానందపరవశీకృ
తాంతరాత్మపరివర్తన యగుటఁ జేసి. 36

ఉ. ఆమె తపఃప్రభావమున కల్లలనాడె మహామహీధ్రముల్
భూమితలంబు తల్లడిలిపోయె దివంబు వడంకె దిగ్గజ
స్తోమము బెగ్గడిల్లె రవిసోములుపోయెడిత్రోవ తప్పె నిం
కేమని చెప్పవచ్చు జగమెల్ల వికావికలాయె నాయెడన్. 37

—♦ హైమవతీబ్రహ్మచారిసంవాదము. ♦—

సీ. వక్షంబునందు రుద్రాక్షమాల ధరించి
మైనిండ మెండు భస్మంబుఁ బూసి
కటితటంబున మౌంజి ఘటితంబుగాఁ జేసి
భుజమునం దుపవీతమును ధరించి
వ్రేలికి దర్భపవిత్రంబుఁ జొప్పించి
మస్తకంబున జడల్ గుస్తరించి
పృష్ఠభాగమునందుఁ గృష్ణాజినముఁ దాల్చి
కరమునందుఁ బలాశకాష్ఠమూని

గీ. ఆననద్యుతి నల్వంక లావరింప
వేదపాఠంబు చెవులకు విందు సేయ
బ్రహ్మచర్యాశ్రమంబు రూపంబుఁ దాల్చి
వచ్చివట్లొక్కపురుషుఁడు వచ్చె నటకు. 38

క. వచ్చి తపస్విని వైఖరి
నచ్చుపడం జూచి విస్మయంబొందుచు లో .
మెచ్చుచు నాయమ దరికిఁ
జెచ్చెర నాతండు చనియెఁ జెలువము మెఱయన్. 39

క. అరుదెంచిన యాతనిఁ గని
పరమానందంబుతోడ భావిని తనకున్
దరిఁజేరియున్న సకియల
నరగంటను జూచిచూడనట్లుల చూచెన్. 40

క. సూచించినమాత్రంబున
నాచేడియ లింగితజ్ఞలగుట నతని క
ర్ఘ్యాచమనపాద్యముల సము
దాచారము నడపి వడిఁ గుశాసన మిడిరన్. 41

శా. ఆదర్భాసనమందుఁ గొంతతడ వాయూసంబునో నాతఁడా
హ్లాదంబొప్పఁగఁ గూరుచుండి లలితవ్యాపారమేపార మ
ర్యాదాసూచకమైన వీక్షణముతో నాతన్వి నీక్షించి యా
స్వాదం బేర్పడ యుక్తియుక్తముగ సంభాషించె నప్పట్టునన్

సీ. స్నానంబునకు యోగ్యమైనట్టి సలిలంబు
సమకూరుచున్నవే విమలగాత్రి!
హోమంబు గావింప నోపరైన సమిధలు
ప్రాప్తించుచున్నవే వనరుహాక్షి!
ధ్యానకాలమునఁ జిత్తమున నైకాగ్ర్యంబు
గలుగుచునున్నదే కంబుకంఠి!
నిర్విఘ్నముగఁ దపోనియమంబు లన్నియుఁ
గొనసాగుచున్నవే కోమలాంగి!

గీ. పరమపావనమైన జీవనముఁ గడప
ఫలములు లభించుచున్నవే పద్మగంధి!
ధర్మసాధనమైన నీతనువు ఘోర
తపమునకు నాఁగుచున్నదే తలిరుఁబోఁడి!. 43

మ. నిరపాయంబుగ నున్నదే వసతి తన్వీ! మానసం బాగ్రహ
స్ఫురణస్థానముగాక శాంతమగుచుఁ బొల్పారునే మానినీ!
కరమందుండెడి దర్భలం దినఁగ నుత్కంఠాతిరేకంబుతో
హరిణంబుల్ చనుదెంచుచున్నవిగదా యంభోజపత్రేక్షణా!

క. రూపము గల్గినచోటఁ
బాపంబులు గలుగవనుచుఁ బలికెడివాక్యం
బీపగిదిఁ నీయెడలఁ
జూపట్టెడిఁ దథ్యమగుచు సురుచిరగాత్రీ! 45

సీ. జననంబు చూతుమా జగదాదికారణ
భూతాత్మభూవంశ హేతుకంబు
రూపంబు చూతుమా రూపవతీలోక
సర్వస్వసర్వస్వాపకర్షకంబు
సంపత్తి చూతుమా సకలరాజాధిరా
జాకాంక్షణీయభోగాస్పదంబు
ప్రాయంబు చూతుమా పరమర్షిగణధృతి
స్వాంతప్రకంపనాచార్యకంబు
గీ. అన్నియునుగూడ నిట్లు నీయందుఁ జేరి
మిక్కుటంబగు సోపాన మెక్కియుండ
దారుణాకారమైన యీ ఘోరతపము
నేల సలిపెద ఈరీతి నీలవేణి ! 51

ఉ. వైరముతోడ నత్త కసివట్టిన మామ పరాభవంబు చే
కూరిచినన్ ధవుండు ప్రతికూలతఁ జెందినఁ దల్లి తండ్రియుఙ్
బోరిన ధీరలైన పుత్రుఁబోంట్లు కృశింతురుగాక తన్వి! యే
కారణమేది యేనియును గల్గని నీవు కృశింపనేటికిన్. 52

ఉ. ఏలతపింతువీవు వచియింపుము బేలలలీలనిట్లు నీ
శీలముఁజూడ విస్మయము చేకుఱె నిన్నుఁబరాభవింపఁగాఁ
జాలిన మూఢుఁడుండునసఁజాలము భావిని! పాము నెత్తిపైఁ
గ్రాలుచునుండు రత్నమును గైకొన నెవ్వఁడు చేయిచాఁచెడిన్

ఉ. ఆరయుమొక్కమాటనిజమాడెదయౌవనభోగ్యమైనశృం
గారమునెల్ల మాని ముదికారునఁ గల్గెడి వేషమూని యా
కారమునందునుండని వికారములం గలిగించుకొంటి వో
సారసనేత్ర! నీకిది విచారముగాఁ గనుపట్టదేమొకో. 54

చ. తళతళలాడుపుష్పములు దాల్చి వెలుంగఁగనుండుమేన నీ
గలగలలాడు వల్కలము గట్టినవైఖరిఁజూడఁ జంద్రతా
రలు విలసిల్లుచుండఁదగు రాతిరి తీక్ష్ణదివాకరప్రభా
కులమయినట్లు మాకుఁబ్రతికూలముగాఁ గనుపట్టెమానినీ!

చ. శివమును గోరి నీవు గడుఁదీవ్రముగాఁదపియింతువందుమా
ప్రవిమలగాత్రి! నీపితృనివాసములన్నియు దేవభూములై
నవనవభోగభాగ్యపరిణామమునన్ విలసిల్లుచుండ నీ
కవసరమేమియింతటిప్రయాసములోఁబడియీఁదులాడఁగన్

ఉ. ఎవ్వనినైనఁగాని వరియింపఁదలంచినదానవైన నో
జవ్వని! నీవుచేయు పని సర్వము వ్యర్థమటంచుఁదోఁచెడిన్
బువ్వనకై మధువ్రతము పూనిచరించుచునుండుఁగానియా
పువ్వుద్విరేఫమున్ వెదకఁబూనునొకోమఱియెన్నఁడేనియున్

ఉ. విరహిణైననీవు వచియింపకపోయినఁగూడ వేఁడిని
ట్టూరుపుచేతఁదెల్లమగుచున్నది నీహృదయంబు కాని నీ
కోరఁగనున్నదొక్కటియుఁగూడఁగనంబడదుండియున్నఁ జే
కూరనిదేదియున్నయది? కోమలి! నీకుఁదలంచిచూచినన్.

చ. ముహురుదయద్విత్రిశ్రమసమున్నతిచేఁ గృశియించి ప్రజ్వల
ద్గ్రహపతితీక్ష్ణరశ్మినిహతద్యుతియైన సుధాంశులేఖనా
నహరహరత్యనుచ్ఛ్రియసమన్వితవయ్యెడి నిన్నుఁ జూడ నే
సహృదయుఁడైనవానికి విచారముగల్గదు మానినీమణీ! 59

ఉ. వేరుగ నెంచఁబోవకుము వేమఱుఁ బల్కుచునుంటినంచు నీ
కోరినవాఁడుమాత్ర మొకక్రూరుఁడటంచుఁదలంతుఁగాని చో
నూరకయుండు నేమి? యిటులొప్పులకుప్ప! త్వదీయవక్త్రశృం
గారముమాపి గండఫలకంబులఁ బెంజడలంటఁగట్టినన్. 60

చ. వ్రతములు వేలుచేసిన దురాసదవయ్యెడి నీవుగోరఁగా
నతులితరూపగర్వసముదంచితభావముచేత వాఁడు వం
చితుఁడయి కానరామిఁ దనచేతికిఁ జిక్కిన పెన్నిధానమున్
వితగఁ బరిత్యజించిన వివేకవిహీనుఁడటంచుఁదోఁచెడిన్. 61

ఉ. ఏల కృశింతువిట్లు కలికీ! చిరకాలము చాలుఁజాలు నీ
శీలముఁజూడ నాకిపుడు చిత్తములోపల జాలివుట్టెడిన్
జాలశ్రమంబుచేతఁ గొనసాగిన నాతపమంధు నీకు నీఁ
జాలుదు నర్ధముం బడయఁజాలుదువీవు మనోరథార్థమున్.

క. చానా! తెలుపుము నీవె
ద్దానికినై యీవిధమునఁ దపియించెదవో?
నేనును భవదీప్సితసం
ధానమునకుఁ జేయువాఁడఁ దగుయత్నంబున్. 63

చ. అనివచియించినంత హృదయంబున నించుక సిగ్గుదోఁప నా
వనజదళాక్షి పైకిఁ దనభావముఁ జెప్పెడి కోర్కి యంతరం
బున నిగుడొత్తుచుండఁ గనుబొమ్మలు కొంచెము విప్పి తత్సఖీ
జనములవంకఁ జూచె నటు చాటుగ ముగ్ధవిలాస మేర్పడన్.

చ. కనుఁగొనునంత నాసఖులు కంజదళాక్షి మనోగతాంక్షితం
బును గమనించి వేడియు ప్రమోదము లొప్పఁగ బ్రహ్మచారి నొ
య్యనఁ బలుకంచి స్వామి! భవదంతరమందభిలాష యుండినన్
వినిచెదమంచు వారు వినిపింపఁ దొడంగిరి నేర్పు తేర్పడన్.

ఉ. ఇంద్రముఖామరాగ్రణుల నేని గణింపక చిత్తమందు మా
చంద్రముఖీలలామ మతిసాహసమేర్పడ నిందుమౌళిపై
నింద్రియవర్గమెల్లను లయింపఁగఁ జేసి తదేకభావని
స్తంద్రములైన వృత్తులకుఁ దక్క తపంబొనరించుచుండెడిన్.

చ. అవిదితకష్టసౌఖ్యమగునట్టి యవస్థకుఁ జిక్కి శంకరా!
శివశివ! నీలకంఠ! శశిశేఖర! భర్గ! మహేశ! యంచు రేఁ
బవలుఁ దదీయనామములు వాకొనుచున్ గిరిరాట్కుమారి యా
భవునకు నిర్దయాత్మునకుఁ బాల్పడియున్నది బ్రాహ్మణోత్తమా.

ఉ. అన్నము మీఁద నాస విడనాడి యలంకృతులందుఁ గాంక్ష వి
చ్ఛిన్నము సేసి నిద్ర నిరసించి కృశించి తపించుచున్న మా
యన్నులమిన్న కెన్నఁటికిఁ బ్రాప్తము గాఁగలఁడో హరుండు మా
పున్నెములింక నెప్పటికిఁ బూర్ణముగా ఫలియింపనున్నవో.

సీ. మాతో డనేమేని మాటాడు వేళలో
మృత్యుంజయుఁడు పల్కరించినట్లు
చెలులెవ్వరే నొద్దఁజేరిన వేళలో
శివుఁడు మెల్లన చెంతఁజేరినట్లు
పది యేనియుఁగాని స్పృశియించు వేళలోఁ
దరుణేందుమౌళిని దాఁకినట్లు
హరినున్న దేదేని దరిసించు వేళలోఁ
బ్రమథనాథుండు గన్పట్టినట్లు

గీ. తలఁచి భ్రమియించి తనమేను పులకరింప
బాష్పములు రాల గద్గదస్వరము వెడల
నితర మేమియు నెఱుఁగక యీలతాంగి
యగడుపడుచున్న దీశ్వరాయత్తయగుచు. 69

క. ఆఁకలిదప్పులు మాని త
దేకాగ్రిము చేసి చిత్త మీయమ మమ్మా
లోకించుచునుండియు నా
లోకింపదు మనసు మనసులో లేకుంటన్. 70

ఉ. ఏమని చెప్పవారమిఁక నీలలితాంగి శరీర మంతయుక్
సామయిపోయె నిప్పటికిసాధ్య మొకాదొ మనోరథంబు మా
కేమియుఁదోఁపకున్న యది యింతటినైన సదాశివుండు మా
కోమలికబ్బునట్లు సమకూర్పుము మ్రొక్కెద మోద్విజోత్తమా

గీ. మిమ్మువంటి మహాత్ము లెవ్వ్రైన నేని
పరహితంబొనరించు భావంబు గలిగి
యుందురనునాసతోడ మేమున్న రీతిఁగ
విన్నవించితిమని యూరకున్న నంత. 72

ఉ. ఆమహానీయుఁ డంతరమునం దనురాగము పల్లవింప నా
భామిని చిత్తవృత్తిపరిపాకము సర్వము నెంచి యో
కోమలి! నీకుఁ గూడను సఖుల్ వచియించినమాటయిష్టమా
యేమి? యథార్థముం దెలుపు మింక నునీ కనుమాన మేటికిన్.

గ. అని కార్యవ్యగ్రత్వంబు సూచించి పలుకుటయు 74

చ. పలికినమాటకున్ బదులుపల్కుట కాయమయిచ్చగించివే
పలుకులతోడ నేమిపని? బ్రహ్మవిదగ్రణి! నిశ్చితార్థమున్
బలికెద నాయొనర్చెడి తపంబున కంతకుఁ జంద్రమౌళిపైఁ
గలిగినమన్మనోరథమె కారణమైనదిసుమ్ము నావుడున్. 75

ఉ. హాసముతోడ నాతఁడనునంబుజలోచన! యెంతకార్యమున్
జేసితి వెంతసాహసము చేసితి వెంతటిదాని కెంత వి
శ్వాసము నెట్టికొంటివి విచారము సుంతయుఁ దోఁప లేదొకో
మాసినపాఁతలోన మణిమాలను గట్టఁదలంచికొంటివే? 76

చ. కలికితనంబుకల్మి నిది కార్యమకార్యమటంచుఁ దెల్పఁగాఁ
గలిగినవారు లేమి నధికారము చాలమి నంతకంతకున్
జులుకన బాసనైతి విదిచూడ రసాతలమొల్లఁద్రివ్వి చుం
చెలుకను బట్టికొన్నవిధ మేర్పడె మాటలు వేయు నేటికిన్. 77

ఉ. దాఁపఁగ నేల నీకుఁ బెడదారులు చూపిరి పాపమెవ్వరో
పాపులు తావకీనగుణవైభవరూపవిలాసభాసురా
టోపముఁ జూచి యోర్వని కఠోరమనంబున ముద్దరాల వీ
వేపగిదిన్ గ్రహింపఁగల విట్టికుయుక్తులనెల్ల భావినీ! 78

చ. హరుఁడన నెవ్వఁడంచు హృదయంబున నీవు దలంచికొంటివో
సురుచిరగాత్రి! వాఁడపరిశుద్ధుఁడు బూదిదమేనితో దిగం
బరుఁడయి కాటిలోపల నివాసము చేసెడి భూతనాథుఁ డా
సరసునిపొందుకై యఱ్ఱులు సాచితి వెంతటివెఱ్ఱిదానవో. 79

చ. వనజదళాక్షి! పెండ్లియనుపల్కుల నావలనుండనిమ్ము మ
న్మను కయిగేలఁ బట్టుకొనఁ బూనిన కాలమునందు బుస్సుబు
స్సనుచుఁ బయింబడన్ దుముకులాడెడు నాతని చేతిపాములన్
గనుఁగొని తత్తరంబునఁ బ్రకంపము నొందక నిల్చియుందువే?

చ. కుశలసమాగమంబనినఁ గొంతవిచార్యము దీనికేమి యా
పశుపతి కౌఁగిలింత సులభంబుగ నీకు లభించుఁగాని యో
శశిముఖి! కమ్మతావి వెదచల్లెడి నీతను వొల్లు ఘర్షణ
ప్రశిథిలమైన తద్భసితపంకములోఁ బడి మున్గి తేలునో? 81

చ. అమృతశిలానిబద్ధమగు నాలయమందున గుప్పుగుప్పునన్
సమధికసౌరభంబు లెగఁజల్లెడు మల్లియపూలలోన నం
దముగను సంచరింపఁదగుదానవు నీవు కపాలశల్యకే
శములకు నాస్పదంబగు శ్మశానములోఁ జరియింప నేర్తువే?

ఉ. పువ్వులు లాజలట్లు పువుఁబోఁడులు పైఁబయిఁజల్లుచుండఁగా
మవ్వపుటేన్గు నెక్కి పదిమందియుఁగూడ హృదంతరంబులం
దువ్విళులూరునట్లు చన నొప్పెడి నీవొక యెద్దు నెక్కి రా
నవ్వనివారలుండరని నాకు స్ఫురించుచునుండెఁ గోమలీ!

ఆ. వె. అమృతభానుఁడతని నాశ్రయించి కళావ
శిష్టుఁడయ్యె వేఱచెప్ప నేల ?
నీరజాయతాక్షి ! నీచరిత్రముగూడ
నట్టిదశకువచ్చె నక్కటకట! 84

సీ. అభిజాత్యము చూచి యాసింతుమందుమా
కులహైన్యమే దానిఁ దెలియఁజేయు
రూప మాలోకించి ప్రాపింతుమందుమా
విషమాక్షుఁ తే దాని వెల్లడించు
సంపద వీక్షించి సాధింతుమందుమా
భైక్షంబ దానిని బయలుచేయు
లక్షణంబులు గాంచి లాలింతుమందుమా
దెసమొలయే వానిఁ దేటపఱుచు

గీ. ఇట్టిమహానీయుఁడగు వరుఁ డెట్లుచిక్కెఁ
బట్టితివి మంచికొమ్మనే పట్టువట్టి
యెన్నినోములునోచితో యెంతతపము
చేసితో యేతదర్థ మోచిన్నదాన! 85

ఉ. ఓసరసీరుహాక్షి! విను మొక్కటిమాట మనోజ్ఞవైభవో
ల్లాసవికాసభాసురవిలాసములొప్పెడు భర్తతోడ భ
ద్రాసన మెక్కఁగాఁ దగులతాంగివి నీవెటులుగ్రమైనవ్యా
ఘ్రాసనమందు జోగియగునాతని చెంతను గూరుచుందువో?

ఉ. జాణవు నీవు నిక్కముగఁ జాతురిగల్గినదాన వాతఁడో
స్థాణువు నీవు సుందరి వతండు విరూపుఁడు నీవు నిత్యక
ల్యాణివతండమంగళుఁడు హాస్యముగాదొకొ? నీవు వానికిన్
రాణివటన్న నెవ్వరయినన్ విను వారలు నవ్వకుందురే?

మ. తెలియంజాలవు మంచిచెడ్డలను నంతేకాని లేకున్న ను
జ్జ్వలశృంగారరసంబులొప్పెడివిలాసస్ఫూర్తితో దివ్యమం
గళసూత్రంబును గట్టఁగాఁ దగిన నీకంఠంబునం దాతఁడో
కలికీ! కాలభుజంగమున్ ముడువ నీకళ్యాణమేమయ్యెడిన్.

చ. అమలినగాత్రి! నీకొకరహస్యముఁ జెప్పెద వానికిన్ మతి
భ్రమ మొకఁడుద్భవించినది పాపము దీనికిఁ దోడు లేనిచోఁ
బ్రమథముతోడ దేవతలు పానము సేయుచునుండు వేళలో
నమృతము వీడనాడి యెవఁడైననుగాని విషంబుఁ ద్రావునే?

ఉ. ఎటులు పరిగ్రహించుటకు నెంచితివో మదిలోన సుందరీ!
నటగణమందుఁ జేరిన యనామకుఁడాతఁడుసుమ్ము కానిచోఁ
గటితటమందుఁ దోలుబిగఁగట్టి జటాపటలంబు మోముపైఁ
జటతటలాడఁ దక్కతయితక్కతకత్తక యంచునాడునే? 90.

ఉ. పుట్టిననాఁటనుండి బహుభోగములం దులదూఁగి నేఁడు చే
పట్టుటకిచ్చగించితి వభాగ్యమునంతయు నొక్కమాటగాఁ
గట్టి పురాకృతం బెవఁడు కాదనిత్రోయఁగ నేర్చు మేలిక్రొం
బట్టుపసిండిపుట్టములపట్టున బెబ్బులితోలు గట్టుమా. 91

ఉ. కన్నియ ! వింటివా? కుటిలగామినియొక్కతె వానినెత్తిపై
నున్నది పైని నాతఁడుమహోగ్రుఁడు నీవిదిగుర్తెఱుంగుమా
యిన్నిటికేమిగాని వచియించెద వేఱొకమాట భాగ్యసం
పన్నవు నీవు పాపము కపాలములోఁ దిననేర్చికొంటివే?92

ఉ. సొమ్ములుగోరినట్లయిన సుందరి! యాతఁడొసంగుఁ గాలస
ర్పమ్ముల నంగరాగమున భావముగల్గినచో శ్మశానభ
స్మమ్మును బూయునాఁకలికి సైఁపనిచోఁ దనబిచ్చమందుఁ బి
చ్చెమ్మొకయింతవెట్టు నిదిసత్యము మాటలు వేయునేటికిఁ

చ. భసితముగోరితో మఱియు భైక్షముగోరితొ లేక ప్రేతభూ
వసతినిగోరితో వృషభవాహవిహారసుఖంబుగోరితో
విసమునుగోరితో పుఱుకపేరులుగోరియొ యేమికోరితో
పసితనమెల్ల నిట్లు పలుపాట్లకుఁ ద్రోచితి వెఱ్ఱిదానవా?94

గీ. మన్మథాంతకుఁ డాతఁడో మంజువాణి
వానితోఁ గూడి నేనొకచానననుచుఁ
గాపురం బెట్లుచేయుదో కాని నీవు
చెలువ లిది విన్న నవ్వులచేటుగాదె ? 95

క. ప్రాచీనుండౌ తండ్రిం డా
లోచింపుము శాలపీవు లోలాక్షీ! నీ
సాచీకృతముఖలీలా
వైచిత్ర్యము నెల్ల వ్యర్థపఱుతువు సుమ్మా. 96

చ. గణవకు నెక్కి పేర్వడిన గట్టుల ఱేనికిఁ బుట్టి పుణ్యల
క్షణవగు నీ వమంగళునిఁ గట్టుకొనన్ దలపెట్టుటెల్ల నో
గుణవతి! పుష్పమాలికను గ్రోఁతికిఁ జుట్టినచందమౌ నిం
దణువున సత్యమాడితి నటంచుఁ దలంపకుమాత్మలోపలన్.

ఉ. అన్నులమిన్న! నేను పరిహాసములాడెడివాఁడగాను నా
కన్నులతోడ నాహరునిఁ గాంచితిఁ గావున నట్టివానిఁ జే
కొన్న యెడన్ సుఖంబు సమకూరునటంచు భ్రమించుచుండు నీ
కున్నదియున్నయట్లు సమయోచితరీతి నెఱుంగఁ జేసితిన్.

ఉ. చేడియ! వేయిమాటలు వచింపఁగ నేమిఫలంబు నీవు నా
పోఁడిమి గుర్తెఱుంగఁగల బోటివి గావున నొక్కమాట నే
నాడెద నేల వానికొఱకై తపియించెదు వెఱ్ఱిదాన! నీ
కీసగజోగుగా వెలయు నెవ్వని నేని వరింపరాదొకో? 99

క. అని కనుసన్నలు సేయుచు
మనమున నుత్సాహపడుచు మానిని మోమున్
గనుఁగొనుచు నవ్వునవ్వుచు
మునుకొని కూర్చుండి మిగుల మురియుచునున్నన్. 100

క. ఆతని వైఖరి కాయము
చేతోవైకల్యమొదవ శివశివ యని సం
జాతామర్ష వశంబున
నాతఁడు కూర్చున్న దెసకు నవ్వలిమోమై. 101

క. ఆపరమేశుని వినిహత
పాపుని నిటు బ్రహ్మచర్యపరులగువారల్
గాపురుషులువలెఁ బల్కుట !
యీపాపము వినఁగవలసెనే ? మాచెవులన్. 102

గ. అని కటకటంబడి 103

ఉ. ఈవు నిజంబుగా నెవఁడ విచ్చటికీవరుదేర నేల ? నీ
భావముచూడఁ దత్త్వపరిపాకవిహీనముగాఁగఁదోఁచె నీ
త్రోవలుచూడ సాధుజనదూరముగాఁగనుపట్టె నీవు మా
తోవసియింపరాదిచట దూరముగానటుపొమ్ము పాఱుఁడా.

ఉ. సాధువులోలె మెల్లఁగను జానలయొద్దకుఁ జేరి యిట్లు దు
ర్బోధలుసేయఁబూనిన ప్రబుద్ధుఁడవెవ్వఁడవీవు పొమ్ము నీ
గాథలుచూడ మాకుఁ గడుఁ గర్ణకఠోరములాయె నీశ్వరా
రాధనవిఘ్నదేవతగ రావుగదా! విపరీతభాషణా! 105

క. ఆరోపింతురు దుష్టులు
దూరీకృతసకలలోకదుర్దోషములై
పేరుకొనంబడిన మహా
చారులచరితములపై వృథాదోషములన్. 106

సీ. ఆదిభిక్షువటన్న యాఖ్య గల్గియుఁగూడఁ
బరమేశ్వరుండని ప్రథితుఁడయ్యె
స్థాణువంచనునభిధాన ముండియుఁగూడ
విశ్వగతుండని వినుతిగాంచె
ఉగ్రుఁడంచను నామ మొనఁగూడియునుగూడ
శివుఁడటంచును సుప్రసిద్ధుఁడయ్యె
హరుఁడని యెడు నాహ్వయము లభించియుఁగూడ
మృడుఁడని గొప్పకీర్తి వహించె

గీ. ప్రేతభూవాసియనుచును పేరువడియు
రజతగిరివాసియని యెడు రాణకెక్కెఁ
గాన నప్రాప్యనిశ్చితాకారుఁడైన
వాని తత్త్వంబు నెఱిఁగినవారు గలరె ? 107

సీ. తలనిండ జడలను ధరియించినను నేమి
తరుణేందుమౌళియై తనరుచుండు
కాలకూటంబును గ్రోలియుండిన నేమి
మృత్యుంజయుండయి మెఱయుచుండు
గజచర్మవసనంబు గట్టికొన్నను నేమి
శ్రీమహాదేవుఁడై చెలఁగుచుండు
నటశిఖామణివోలె నాట్యమాడిన నేమి
జగదేకదైవమై నెగడుచుండు

గీ. అవిదితాత్మీయ వర్తనుఁడైనవాని
వేషమొకరీతిదని నిరూపింపఁగలరె?
తెలివితక్కువవారలు తెలియలేక
పలుపలువితంబులుగ వానిఁ బలుకుచుంద్రు. 108

ఉ. ఏవృషభంబునెక్కినను నేమికొఱంతజనించువాని నై
రావతవాహనుండగు పురందరుసంతతివాఁడై వచ్చి సం
భావితమైన తచ్చరణపద్మపరాగము దాల్చి మోమునన్
బోవుచునుండు నిత్యమును భూరిమనోరథసిద్ధికాముఁడై.

గీ. కామదాహకుఁడైనను గామదాత
విషమలోచనుఁడైనను విశ్వనేత
భూతపతియైన నభయప్రదాత యతఁడు
దీని నెఱుఁగక మూఢులు తెగడుచుంద్రు. 110

ఉ. బూడిదపూయునంచు జడబుద్ధులు నవ్విననేమి తాండవం
బాడెడివేళలన్ గళితమయ్యెను తత్తనుభస్మమింత చే
కూడినఁజాలునంచు గుమిగూడితలంచుచునుందు రెప్పుడున్
వేడుకతోడ నిర్జరులు నిత్యరమావిభవాభిలాషులై. 111

చ. పశుపతియంచు నాతని న
భాగ్యులు నవ్విననేమి? తత్కృపా
వశమయి సర్వలోకముఁ బ్రి
వర్తిలుచుండుఁ దదాజ్ఞ లేనిచో

శశి సమయించియుండఁడె ? త్వి
షాంపతి రూపముమాపియుండఁడే ?
ప్రశమ మొనర్చియుండఁడె ? ప్ర
పంచము నెన్నఁడో పంచభూతముల్. 112

గీ. బహుళసంసారపాశనిబద్ధులైన
యప్రబుద్ధులరీతి నాయష్టమూః
భంగురములైన మంగళామంగళముల
కాసఁజెంది ప్రవర్తిల్లునట్టివాఁడె? 113

చ. హరియుహిరణ్యగర్భుఁడు నహర్నిశ మీమహనీయునానతిన్
శిరమునఁదాల్చిలోకములు చేయుచునిల్పుచునుందు రాపరా
త్పరుఁడును నిట్టిఁడట్టిఁడని పల్కఁగ నెవ్వఁడు సాహసించు నీ
కరణి స్వకీయమైన యధికారమెఱుంగనివాఁడు దక్కఁగన్.

గ. అని యిట్లు గిరిరాజకన్య శివదూషణాసహమానమాన
సయ్యై కోపాటోపంబునఁ బలుకుచున్నంత నవ్వటువు నప్పాఱుం
డేమియో వచియింపందలంచి పెదవి కదలించుచుండ నద
రిపడి యాయమ చెలియలంజూచి 115

మ. చెలులారా! యితఁడేవియోమరలనశ్లీలంబులన్ బల్కఁగాఁ
దలఁకొన్నట్టులుదోఁచె వీనివిధమున్ దర్శింప నీద్రోహపుం
బలుకుల్ వీనులలోనఁజొచ్చిన మహాపాపంబుచేకూరు నా
పలుకుంబోవ్రదమంచు లేచి చనఁబోవన్ జూచున లోపలన్

## —• పరమేశ్వరసాక్షాత్కారము •—

సీ. అమృతంబుఁ గురియించు హిమరశ్మికళతోడ
వగకుల్కు గంగాభవానితోడ
మణిదీపితములైన ఫణిహారములతోడఁ
జిత్రితంబగు గజాజినముతోడ
రుచిఁ గ్రిమ్మరించెడి రుండమాలలతోడ
సొగసుమీఱిన జటాచ్ఛటలతోడ
ఆశ్చర్యదాయకంబగు త్రిశూలముతోడ
బుగబుగలాడు మైపూఁతతోడ

గీ. జగము మోహింపఁజేయు చిన్నగవుతోడ
మురిపములు మూటగట్టెడి ముఖమ్ముతోడ
డంబు చెలువార స్వస్వరూపంబుఁ దాల్చి
యద్రిపతిపుత్త్రి కతఁడు ప్రత్యక్షమయ్యె. 117

క. అంతట నాయమ తన వృ
త్తాంతంబంతయును మఱచి యంతర్ముఖయై
సంతోషాతిశయంబునఁ
గొంతతడవు కనులుమూసికొని నిశ్చలయై. 118

క. తా నతిమాధుర్య మవా
ఙ్మానసగోచర మచింత్యమానం బఖిల

ధ్యానాతీతంబగు బ్ర
హ్మానందరసామృతంబు నాస్వాదించెన్. 119

అంత నీశ్వరమాయాప్రభావంబునఁ గొంతతడవునకాభూ
మికనుండి తొలంగి కన్నులంజెఱచి హాసగతంబగు పెన్ని
ధిం బోఁగొట్టుకొనిన పేదచందంబున భయకంపితస్వాంత
డై తదేకరసాస్వాదకుతూహలపరవశుఁడై నిరాకృతప్ర
పంచావలోకనస్పృహుఁడై విస్మృతనిజతపఃప్రవృత్తికారణ
డై పురోదృశ్యమానంబగు దివ్యమంగళవిగ్రహంబు నా
లోకించి చేతులు జోడించి 120

క. జయజయ యనాథరక్షక!
జయజయ జగదేకనాథ! జయజయ దేవా!
జయజయ మంగళమూర్తీ!
జయజయ నిహతార్తి! శిష్టజనవశవర్తీ! 121

దండకము.

శ్రీమన్మహాదేవ! దివ్యప్రకాశా! నమోవాక
మవ్యక్తమూర్తీ! పురస్కార మక్షయ్య మోక్షప్రదానక్రి
యాబద్ధదీక్షా! నతుల్ స్వామి! త్రైలోక్యవిశ్వేశ్వరా!
వందనంబవ్యయాత్మా! ప్రణామంబు మృత్యుంజయా!
దండమోంకారరూపా! నమస్కార మాదిత్యచంద్రాగ్నినే
త్రా! ప్రసూనాంజలుల్ భక్తమందార! సాష్టాంగముల్
సర్వలోకావనాధార! జోహారు నిత్యోత్సవా! మంగళం

నేను నీదాన నర్థించెదఁ నిన్నుఁ బ్రార్థించెదఁ నిర్భయం
బై నిరాలంబమై నిత్యకళ్యాణమై నిర్గుణంబై నిరాలేపమై
సచ్చిదానందమై భావనాతీతమై సాక్షియై దివ్యమై భవ్య
మై సత్యమై నిత్యమై గూఢమై రూఢమై శుద్ధమై బుద్ధమై
వెల్గు వెల్గుఁ గని రూపింపుమా నాకుఁ జూపింపుమా స్వామి!
యూఁకొట్టుమా నన్నుఁ జేపట్టుమా చంద్రమౌళీ! కటా
క్షింపుమా శూలపాణీ! విలోకింపుమా నీలకంఠా! ప్రసా
దింపుమా వ్యోమకేశా! సమీపింపుమా ధూర్జటీ! కా
వుమా నాగయజ్ఞోపవీతా! తిరస్కారమా? భస్మలిప్తాంగ!
ధిక్కారమా? లోకసంరక్షణా! భారమా? నాగచర్మాంబ
రా! వైరమా? ఈశ్వరా! నేరమా? దీనరక్షామణీ! దాన
చింతామణీ! దేవచూడామణీ! పాహిమాం పాహిశంభో!
నమస్తే నమస్తే నమస్తే నమః. 122

గీ. అనుచు నుతియించుచుండ నాయష్టమూర్తి
ప్రేమ నొకరత్నహారంబు నామెగళము
నందువైచి తిరోధాన మొందె నంతఁ
గలనుగన్గొని మేల్కాన్న కరణిదోఁప. 123

క. ఎక్కడ? నాప్రాణేశ్వరుఁ
డెక్కడ? నాపెన్నిధాన మెక్కడ? నావాఁ
డెక్కడ? నేనెక్కడ? న
న్నక్కటకట మోసగించి యాతఁడు వోయెన్. 124

గ. అని పెక్కువిధంబులం బొక్కుచు నక్కాంతామణి కొంత
తడవునకుఁ దనకంఠంబున 125

మ. హరనామాక్షరచిహ్నితంబయిన యా
హారంబు వీక్షించి య
బ్బురముం జెంది కవుంగిలించికొనుచున్
భూషించుచున్ సారె కం
తర ముప్పొంగఁగ ముద్దువెట్టికొనుచున్
దర్శించుచున్ జంద్రశే
ఖరసందర్శనజన్యమైన సుఖమున్
గాంచెన్ విచిత్రంబుగన్. 126

శా. అంతన్ జెడియలామెకిచ్చినమహాహారంబు దర్శించి యో
కాంతా! యిందుధరుండు నీవయిన సంకల్పంబు నీడేర్చె నీ
సంతోషం బెఱిఁగించి త్వద్గురుజనస్వాంతంబు నెంతేని ని
శ్చింతంబుం బొనరింతమియ్యెడల రా శీఘ్రంబుగా నావుడున్

గీ. భవుఁడు ప్రత్యక్షమైన విశ్వాసమునను
హారమునఁ దన్ను నేలిన కారణమునఁ
జెలియ లాడెడిమాటలు చిత్తగించి
తల్లిదండ్రులకడకు నా తన్వి వెడలె. 128

## వసంతతిలకావృత్తము.

సీమానభిజ్ఞగుణసేవధి ! విశ్వయోగ
క్షేమావహా ! సుకృతికీర్తితనామ ! దుర్వ్యా
యామాపహా! బదినహోలుపురాధివాసా !
శ్రీమల్లికార్జున ! యశేషజగన్నివాసా ! 129

## గద్యము.

ఇది శ్రీమత్పరమపవిత్ర భారద్వాజసగోత్రాపస్తంబసూత్ర
సీతారామపుత్ర కనకాంబాగర్భశుక్తిముక్తాఫల పరమేశ్వర
ప్రసాదసముపలబ్ధసుకవితాభాగధేయ శతావధాన
విధానధౌరేయ కావ్యకళానిధి చిదంబరనామ
ధేయ ప్రణీతంబగు హైమవతీవిలాసం
బను మహాప్రబంధంబున
ద్వితీయాశ్వాసము.





# హైమవతీవిలాసము

## తృతీయాశ్వాసము

క. సాధనసంపదుపార్జిత
బోధజ్ఞేయస్వరూప ! భువనత్రయసం
స్థాధార ! బదినహోలుపు
రాధీశ్వర ! మల్లికార్జునా ! పరమేశా !

### నారదసంధానము

గ. అది యట్లుండఁ గైలాసంబునందు మహేశ్వరుం డొక్కయేకాంతప్రదేశంబునం జేరి పాణిగ్రహణకుతూహలసంజాతనిరంతరపరితాపదోదూయమానమానసుండై పర్వతరాజకన్యాపరిగ్రహణం బవశ్యకార్యం బని నిశ్చయించి హిమవంతునకు సందేశంబుఁ బంపఁదలంచి యేతత్కార్యంబున కెవరు ప్రేష్యభావంబు నొందఁదగినవారని యాలోచించుచుండునవసరంబున 2

క. వచ్చెన్ బ్రహ్మాతనూభవుఁ
డచ్చో లోకమునుండి యుత్సాహముతో
నచ్చటికి దైవకార్యము
నచ్చుపడం జేసి ధన్యుఁడయ్యెడురీతిన్. 3

క. అరుదెంచిన యాతనిఁగని
మురిపమునై నీశ్వరుండు మునినాథా! నీ
దరిసెనమున నాయంతః
కరణము శాంతించెననుచుఁ గార్యమువినియెన్. 4

క. వినిపించినఁగర్ణరసా
యనముగ నాలించి క్షణమునం దీకార్యం
బనుకూలముగావించెద
ననియెన్ జనియెన్ మునీంద్రుఁ డాహ్లాదమునన్. 5

గ. అంతనీశ్వరుండు వివశీకృతేంద్రియుండయి తన పగదీర్చు
కొనుటకిదియ యదనని యిక్షుసాయకుం డేయుమార్గణంబు
లకు సహింపంజాలక హృదయపీఠంబున నవ్వరారోహ
నధిష్ఠాతృదేవతం గావించి దేవతాపూజావసరంబున హైహి
కవిలాసంబులు కూడవనుచందంబున మలయమారుతంబు
నీసడించుచు శిరోవతంసంబగు చంద్రకళను ద్వేషించుచుఁ
బరివారంబు నిచ్చగింపక జనసంసర్గ మసహ్యంబుగాఁ
దదేకధ్యాననిష్ఠాగరిష్ఠభావంబున క్షణంబులు గడపఁదొ
డంగెనంత. 6

క. వచ్చెన్ బ్రహ్మతనూభవుఁ
డచ్చెల్లోకమునునుండి యుత్సాహముతో
నచ్చటికి శైవకార్యము
నచ్చుపడం జేసి ధన్యుఁడయ్యెను రీతిన్. 3

క. అరుదెంచిన యాతనిఁ గని
మురిపమునై నీశ్వరుండు మునినాథా ! నీ
దరిసెనమున నాయంతః
కరణము శాంతించెననుచుఁ గార్యము వినిచెన్. 4

క. వినిపించినఁ గర్ణరసా
యనముగ నాలించి క్షణమునం దీకార్యం
బనుకూలముగావించెద
ననియెన్ జనియెన్ మునీంద్రుఁ డాహ్లాదమునన్. 5

వ. అంతనీశ్వరుండు వివశీకృతేంద్రియుండయి తన పగదీర్చు
కొనుటకిదియ యదనని యిక్షుసాయకుండేయుమార్గణంబు
లకు సహింపంజాలక హృదయపీఠంబున నవ్వరారోహ
నధిష్ఠాతృదేవతం గావించి దేవతాపూజావసరంబున హైహి
కవిలాసంబులు కూడవనుచందంబున మలయమారుతంబు
నీసడించుచు శిరోవతంసంబగు చంద్రకళను ద్వేషించుచుఁ
బరివారంబు నిచ్ఛగింపక జనసంసర్గ మసహ్యంబుగాఁ
దదేకధ్యాననిష్ఠాగరిష్ఠభావంబున క్షణంబులు గడపఁదొ
డంగెనంత. 6

సత్కారంబు లాచరించుటయు నారమంపు నుపచారం
బులకు మిగుల సంతసిల్లి 10

ఉ. భాగ్యము చూతుమా విబుధపుంగవసంస్తవభాజనంబు సౌ
భాగ్యముచూతుమా సుకృతభాగ్జనవిస్మయదాయకంబు వై
రాగ్యము చూతుమా యనితరశ్రితసాధనసాధితంబు నీ
యోగ్యతకన్న గూడఁదగియున్నవి భూధరరాజశేఖరా! 11

క. ఎన్నిక కెక్కిన నీవిన
యోన్నతి ఘనమైన నీగుణోన్నతి బహుళా
భ్యున్నతిగల తావకశిఖ
రోన్నతికిఁ వన్నెవెట్టుచున్నవి సుమ్మా. 12

గీ. విష్ణుపాదంబునందు నావిర్భవించి
యెంతప్రఖ్యాతికెక్కెనో యంతకంటె
నధికమగువాసిఁ గాంచె ననంతరంబు
గంగ నీయందుఁబుట్టిన కారణమున. 13

గీ. కఠినభావంబు స్థావరకాయమందు
నర్పితముఁజేసి యీకాయమందు సుగుణ
సంపదలనెల్లఁ గొల్లగా సంఘటించి
పరమధన్యుఁడవైతి వోపర్వతేంద్ర! 14

గ. అని మిగుల నాతనిగుణంబులు శ్లాఘించి తత్పార్శ్వంబున
నిలువంబడియున్న పార్వతి నుద్దేశించి 15

ఉ. ఈయమ పూర్వమందుఁ బరమేశ్వర పాణిగృహీతియైన దా
క్షాయణి లోకమాతసుమి తన్మహిభృదధీశ్వర ! త్వత్తపఃఫలం
బై యిపుడిట్లు నీగృహమునందుదయించిన దింతకంటె శ్రే
యసమేమియున్న యది చెప్పుము గేస్తులకెందు నేనియున్

వ. అని పలికి యించుక సేపూరకుండి. 17

ఉ. ఇంతకుఁ జెప్పవచ్చినది యేమన నీకు శుభంబుగల్గు వృ
త్తాంతము నీకులంబునకు ధన్యతగల్గెడిమాట నీమన
శ్శాంతికి మూలసాధనము చక్కఁగ నీవు గ్రహించి కొమ్ము మా
యంతటివారు చేయరుసుమా యెపుడే నిదృశాప్రసంగముల్

సీ. వహించుచుండు నెవ్వాని యష్టమూర్తులు
జగముల రథము నశ్వంబులట్లు
ధరియించు నెవఁడసాధ్యంబైన యీశ్వర
భావంబు సౌష్ణ్యంబు జ్వలనమట్లు
ఎదురుచూచుచునుండు రెవ్వానికొఱకు సూ
గాలు తల్లికై పసికూనలట్లు
ఎవని పదంబు దుఃఖవివర్జితంబయి
శోభిల్లుచుండు సుషుప్తియట్లు

గీ. అతఁడు సర్వేశ్వరుండు సుధాంశుమౌళి
పుణ్యములపంటయైన నీకన్నెపైని
నాసఁగొనియున్నవాఁడు నన్నంపినాఁడు
భాగ్యవంతుఁడవైతివి పర్వతేంద్ర ! 19

ఉ. ఆతఁడుచూడ లోకములకన్నిటికిన్ బితయైనవాఁడు వి
శ్వాతిశయప్రభావుఁడు మహాత్ముఁడుకోరుచునున్నవాఁడునీ
చేతముచూడ యోగ్యపరిశీలనమైనది యింతకున్ జగ
న్మాతనొనర్పుమయ్య గిరినాథమణీ! భవదాత్మజామణిన్.

ఉ. యోగ్యుఁడవీవుదాతవతియోగ్యుఁడుశూలివరుండునిత్యసౌ
భాగ్యసముజ్జ్వలాంగియగుపార్వతిపెండ్లికొమార్తచక్కఁగా
యోగ్యసమాగమంబుఁగననుండివచించెడివారమేము నీ
భాగ్యముగాక వేఱొకనిభాగ్యముభాగ్యమొకో? గిరీశ్వరా!

చ. ఎవరు నుతించుచుండినను నెవ్వనినైన నుతింపకుండఁగా
నెవరు నమస్కరించినను నెవ్వనికేనియుమ్రొక్కకుండఁగా
నెవఁడు చరాచరంబులకునెల్ల గురుండననొప్పివెల్గు నా
భవునకున్ గురుండవగుభాగ్యమునీకుఁదటస్థమయ్యెడిన్

మ. అనిభాషించెడివేళలోనఁ బరమాహ్లాదంబుతో మేనకా
వనజాతాక్షి నిజాంతరంగమెఱిఁగింపన్ సిగ్గుచేమోముహ్రాం
చినదై పార్వతి గూడ నట్ల ప్రకటించెన్ స్వీయభావంబునం
తమ లీలాబ్జదళంబులెంచు మిషచేతన్ గౌశలంబేర్పడన్.

క. హిమవంతుండాయిరువుర
క్రియములక్షించి యాఁగరాని మనోవే
గమునన్ స్వామీ! మాపు
ణ్యమునకు ఫలమిఁతకన్న నధికంబున్నే? 24

క. అల్లుఁ డగు మాదృశుల క
నల్పుండా తండు లభ్యుఁ డగు నెవ్వ మాసం
కల్పముల కెల్ల నది యా
కల్పస్థాయి యగు ఫలము గాదె? మహాత్మా! 25

క. ధన్యుల మైతిమి నేఁడు వ
దాన్యుల మైతిమి సమస్తదైవతగణ స
మ్మాన్యుల మైతిమి శివునకుఁ
గన్యాదానంబు సేయఁగలిగినకతనన్. 26

గ. అని యీవిధంబునఁ బరమేశ్వరుండు తన కల్లుండగాఁగ లందను మహానందంబుం బ్రకటించు హిమవంతుం జూచి నారదుండు శైలనాథా! నీపురాకృతం బనాజ్మనసగోచరంబు నీభాగ్యం బసామాన్యంబు నీతపం బమితంబు నీహృదయంబు పవిత్రంబు. కాకున్న నిట్టిసంఘటన చేకూరునే? కాలంబతిక్రమించుచున్నయది. ఎల్లి పరమేశ్వర కళ్యాణభాగ్య యోగ్యంబగు నొక్కసుముహూర్తంబు తటస్థమై యున్నయది. శీఘ్రంబ నీవు దానికి సిద్ధపడుము. మేము నిత్యకళ్యాణమూర్తి యగు నాసదాశివునిఁ దోడ్కొనివచ్చెదమని యతిరయంబునం జనిరి. 27

—♦ హైమవతీపరిణయసన్నాహము ♦—

క. అంతట హిమవంతుఁడు బహు
సంతోషము తోడ సమయసముచితరీతిన్

స్వాంతమునఁ దలఁచి కార్యం
బంతయు సాధింప నెంచి నతివేగమునన్. 29

ఉ. ఆతఁడు సత్త్వవంతుఁడు మహాత్ముఁడు గావునఁ దుచ్ఛసాధన
వ్రాతముపైని బుద్ధినిడరాదని నేర్పున విశ్వకర్మనా
హూతునిఁ జేసెఁ జిత్తమున నొయ్యన నాతఁడు వచ్చి లోకవి
ఖ్యాతములైన కార్యముల నయ్యెడఁ జేయఁదొడంగె నేర్పునన్

కం. పలుకోటలు పలుపేటలు
పలుమేడలు పలువితముల పనులచ్చోటన్
దులకింపఁ జేసె నాతఁడు
తలఁచినమాత్రంబులోనఁ దనచాతురిచేన్. 30

సీ. నిగనిగలాడఁగా నిర్మించె మౌక్తిక
మణులతోఁ గళ్యాణమందిరములు
తళతళలాడఁగా వెలయించె మరకత
మణులతో నాస్థానమందిరములు
కలకలలాడఁగాఁ గట్టె గోమేధిక
మణులతోడ విలాసమందిరములు
ధగధగలాడఁగా నెగడించె వైడూర్య
మణులతోడ విహారమందిరములు

గీ. సాంద్రదీప్తిచ్ఛటలుమీఱ నింద్రనీల
మణులతోఁ జేసె మజ్జనమందిరములు.

పొలుపు చెలువొంది దీపింపఁ బుష్యరాగ
మణులతోఁ జేసె భోజనమందిరములు. 31

గీ. జపతపోమండపములు విశ్రాంతిమండ
పములు కేళీకళామండపములు చిత్ర
మండపములు మహాసభామండపములు
పెక్కులొనరించె లెక్కకు మిక్కుటముగ. 32

గీ. విష్టపంబులనుండు పవిత్రధర్మ
మంతయును మూర్తమై ప్రాప్తమయ్యె ననఁగ
నమృతపాషాణశతసహస్రములతోడ
నతఁడు నిర్మించె నగ్నిహోత్రాలయంబు. 33

క. హస్తచతుష్టయవిస్తృత
మై స్తంభచతుష్టయాప్తమై భవ్యంబై
హస్తోచ్ఛ్రితమై మండప
విస్తీర్ణంబైన భద్రవేది నొనర్చెన్. 34

గీ. అతఁడు చేసినపను లిన్ని యన్ని యనుచుఁ
జెప్పఁబూనిన నెవ్వఁడు చెప్పఁగలఁడు
పెనఁగి భువనంబులెల్ల వచ్చినను గాని
నిలువఁదగినట్లు గావించె నెలవులెల్ల. 35

సీ. భూరివిద్యుద్దీపపుంజమంజుప్రభా
భ్రాజమానాశేషరాజపథము

పరిపూర్ణఫలపుష్పపరిమళవిలసన
రీతిపరిపంచితాక్రీడకంబు
ద్యోచపేటప్రదానోద్యమోద్ధృతభుజా
స్తంభభరిమాధాయిసౌధకంబు
ఆకాంక్షణీయనానార్థసంతతిసంప్ర
వృద్ధిభాసురమహావిపణికంబు
గీ. లలితలలితప్రకారకళావిలాస
దీపితానల్పశృంగారదీప్యమాన
నిత్యకళ్యాణరూపనిర్ణిద్రసంప
దాస్పదంబొప్పె హిమవత్పురాంగణంబు. 36

గీ. అంతఁ బ్రమదంబుతోడ నీశుభోదంత మెల్ల
శైలనాథుండు తన మనశ్శక్తివలన
నెల్లలోకంబులకుఁగూడ వెల్లడించె
సంతరింద్రియమహిమ లత్యద్భుతములు. 37

గీ. విశ్వనాథుని పెండ్లికి విశ్వమెల్లఁ
దరలివచ్చిన నచటఁ బదార్థములకు
వెలితి రానీయరాదను తలఁపుతోడఁ
గామధేనువు వచ్చె నక్కడికి మొదట. 38

గీ. ఆఱుఋతువులుగూడ నాహ్లాద మొదవ
నచటియుద్యానవనముల నావరించెఁ

పెండ్లియాడెడి జవదారి వితము నెల్లఁ
జూడ నాశించి వచ్చిన సొబగు దోఁప. 39

సీ. తన భూరిసలిలపరిదాన నైపుణ్యంబు
గనిపించుటకు నిదే కాలమనుచు
తన లోకసౌఖ్యసంధానచాతుర్యంబు
వివరించుటకు నిదే వేళయనుచు
తన సత్వరాష్ణ్యవిధానకౌశల్యంబు
చాటించుటకు నిదే సమయమనుచు
తన మందగమననైదగ్ధ్యాతిరేకంబు
చూపించుటకు నిదే సుదినమనుచు

గీ. వరుణుఁడే తెంచె సూర్యుఁడు ప్రాప్తమయ్యె
వహ్ని దయచేసె నాశుగస్వామివచ్చె
విశ్వమయుఁడైన శివునకుఁ బెండ్లియ నెడు
వార్తయిసుమంత తెలియంగవచ్చినంత. 40

గీ. ప్రాజ్ఞజనమాన్య స్థావరరాజకన్య
తనకుఁదోసిడ కానున్నదనుచుఁజూడ
వచ్చినట్టుల దివిజసరివంతి డిగ్గి
కాల్వయై పరివహించె నాకాలమందు. 41

గీ. క్షణములోపల నక్షత్రగణము లెల్ల
నాక్రమించెను హిమవత్పురాంగణంబు

తొలుతఁ బెండిలియింట విద్యుత్ప్రదీప
మాలికలు వ్రేలఁగట్టిన లీలఁదోఁప. 42

చ. సముచితభూషణంబులఁ బ్రసాధనముల్ గ్రహియించి మేలిపు
ట్టములనుగట్టి వేడుక హుటాహుటి నివ్వటిలంగ నిర్భర
ప్రమదముతోడ నేఁడుమన పార్వతి పెండ్లియటంచువచ్చినా
హిమగిరిరాజబంధుగణ మెల్లఁ దలంచినయంతలోఁ బలెన్. 43

గీ. సూర్యుఁ డచటికి ముందుగాఁ జూడవచ్చి
యుండుటం జేసి రాత్రి లేకుండె నచట
దానఁగాలంబుఁ దెలియక దైవవిదులు
గడియలను నెంచి రాతిరి గడచె ననిరి. 44

—♦ హైమవతీప్రసాధనము ♦—

గ. అంత మంగళవాద్యంబులు మిన్నుముట్టఁ బార్వతిం గళ్యా
ణపీఠంబునఁ గూరుచుండఁబెట్టి సంతానవతులగు ముత్తైదు
వలు పరమాహ్లాదంబుతోఁ జేతికిఁ దాంబూలస్వర్ణక్రముక
పత్రంబు లొసంగి కల్యాణగీతంబులు పాడుచు 45

సీ. సౌరభంబులనీను సంపంగెనూనియ
కలపంబునం జేసి తలకునంటి
జవ్వాదికలిపిన చందనతైలంబు
మిసమిసలాడెడి మేన నలఁది

అమృతసమ్మిశ్రితంబగు గోపకస్తూరి
లలితసంగకములకు నలుగువెట్టి
మంచిముత్తియములు మరకతంబులు దృష్టి
దోషంబునకు దిగఁదుడిచివైచి

గీ. ముస్తాలొత్కడు నెలతాలగ గ్రైసైని
నిండు వేడుకతోడఁ గూర్చుండఁబెట్టి
నీటు గులుకంగ జలువపన్నీటితోడ
జలకమార్చిరి నీహారశైలసుతకు. 46

గీ. జలకమార్చినజలము కాల్వలుగ వెడలి
పోవుచుండఁగ నప్పుడా పూవుఁబోఁడి
యానసేందుద్యుతులకుఁ జంద్రాశ్మవేది
కరఁగి ప్రవహించుచుండెడి కరణి దోఁచె. 47

గీ. చెలులు తడియార్చుచుండ నాకతికి కురుల
వలన జాఱెడు జలకణంబులు చెలువ[illegible]
బ్రిచలితంబైన నీలనిం[illegible]
రాలుచుండిన ముత్త్యాలజా[illegible]. 48

గీ. మంగళస్నానమాచరింపంగఁజేసి
పట్టుపుట్టంబు లామెకుఁ గట్టఁబెట్టి
భద్రమాణిక్యపీఠంబుపై నిలుంచి
పడఁతుకలలంకరింపఁగాఁ దొడఁగిరపుడు. 49

సీ. సరసిజంబులఁబోలు చరణంబులకు లాక్షా
కమనీయమగు యావకంబు వెట్టి
కాదంబినిహసించు కైశ్యంబునకుస్వాహా
దంబైనయగురుధూపంబు వేసె
కంబుసన్నిభమైన గళమునందును దార
చారుమౌక్తికతారహారముంచె
శ్రీకారములఁబోలు చెవులకు రోహిణి
యొప్పైనతాటంకయుగముఁ గూర్చె

గీ. నభమునకు మాఱురూపైన నడుమునందు
మంజుకాంచీకలాప మమర్చె గార్గి
సోమునకు నీడుజోడైన మోమునందు
అలితముగ దిద్దెఁ గనుబొమ్మలను సుపర్ణ. 50

ఉ. పాటలగంధిరో! వృషభవాహనుఁడానఁ దౌ నీమగం డిఁకన్
బాటలుపాడవచ్చు మనబావకు వేలని పల్కి యామె పై
పోటులచేబహూకృతులుపొందుచుఁదన్నయనంబులందుఁ గ్రొం
గాటుక రేకదిద్దె నొకకామిని కైఁగొని గోట నీటుగన్. 51

ఉ. కోరి వరించికొంటి వనుకూలుని నాతని పేరు చెప్పు టా
చారముసుమ్ము కోమలి! ప్రసాధనమందని పల్కి యామె సిం
గారపుసిగ్గుసిగ్గులను గాంచుచు నొక్కలతాంగి మంజుమం
జీరములన్ దదంఘ్రిసరసీజములందు ఘటించె నేర్పునన్.

గీ. ముద్దుముద్దుగఁ జెక్కిళ్లు ముద్దులాడి
చిబుక మొకకొంచె మెత్తి వైచిత్ర్య మొదవ
ముడిసికొని ముద్దుకన్నియ ముఖసరోజ
మందు మేనక దీర్చెఁ గళ్యాణరేఖ. 53

ఉ. చూతము పెండ్లికూఁతునని చూడఁదలంచిన యంతలోపలన్
గౌతుకబాష్పపూరములు గన్నులనిండిన మేనకాసరో
జాతముఖీలలామ మతిసంభ్రమ మొందుచు మెల్లమెల్లఁగాఁ
గౌతుకభద్రసూత్రమును గట్టెఁ గుమారి కరాంబుజంబునన్

— ♦ పరమేశ్వరపరిణయప్రస్థానము ♦ —

గ. ఇవియిట్లుండ 55

క. కైలాసంబునఁ గంటే
కాలుఁడు నారదుని రాకకై తమకముతో
నాలోకించుచునుండెను
నాలోపల సిద్ధమంత్రమను చందమునన్. 56

ఉ. ఆమునిసార్వభౌముఁడు రయంబున వచ్చి శుభప్రసంగమా
స్వామికి విన్నవింపఁగను సమ్మదమేర్పడ నామృడుండు స్వ
క్షేమముఁగోరి యెల్లపుడు సేవలు సేసెడి నందికేశ్వర
స్వామి ముఖంబుఁ జూచె నది సర్వమతండు గ్రహించి లీలమై

మ. ఘనశంఖధ్వనిఁ జేసె నయ్యెడల వేగన్ బెండ్లికిన్ రండురం
డని చాటించినరీతి నానినద మాహ్వానస్వరూపంబునన్

జని లోకంబుల నావరింపఁ గను సన్మానంబుచే వచ్చిరో
ల్యృన మున్మందు గడంగి సప్తఋషులర్థాంగీన మేతంబుగన్

శా. భూనీలాకమలాన మేతుఁడయి సంపూర్ణానురాగప్రభా
తానంతంబునఁ దార్క్ష్యవాహనమునందాసీనుఁడై బంధుమి
త్రానీకంబులతోడ వచ్చె భువనాధ్యక్షుండు నారాయణుం
డానందీశ్వరశంఖనిస్వనశుభాహ్వానంబు తోనీడఁగాన్. 59

చ. పతిహితకాంక్షులైన పరివారము పార్శ్వయుగంబునందురా
నతులితహర్ష మేర్పడ రయంబున గీర్వనితాలలామతోఁ
జతురగతాగతప్లుతరసజ్ఞతగల్గిన హంస నెక్కి యా
శతధృతి యేగుదెంచె స్మరశాసనశాసనదాసదాసుఁడై. 60

ఉ. భావమునందు వేడ్క గొలుపంగ శచీసతితోడఁగూడ సం
భావితమైన స్వత్రిదివవస్తువులన్ గ్రహియించి యిందిరాఁడై
తావత మెక్కి వచ్చె నటరాజకరగ్రహణోత్స వేక్షణా
స్థావివశాత్ముఁడై మదనశాసనుఁడుండినచోటికయ్యెడన్.

గీ. ధార్మికములైన యగ్నిహోత్రములతోడ
వినయవతులైన నిజకుటుంబినులతోడ
వేదములుచెప్పికొను శిష్యవితతితోడ
వచ్చిరపుడు ఋషీశ్వరుల్ పెచ్చుపెరిఁగి. 62

ఉ. వచ్చిరి దేవదానవులు వచ్చిరి కిన్నరు లప్సరోంగనల్
వచ్చిరి సిద్ధచారణులు వచ్చిరి యక్షులు నాగకన్యకల్

వచ్చిరి సర్వదిక్పతులు వచ్చిరి లోకములెల్ల నొక్కటై
వచ్చినవారి నప్పుడిక వారని వీరని చెప్ప నేటికిన్ ? 69

ఉ. మోదముతోడ నయ్యెడల ముందుగఁ బుణ్యవధూటులైన ము
త్తైదువలెల్లఁ గూడి త్రిపురాంతకుఁ బెండ్లికుమారుఁ జేసి బ్ర
హ్మాదులు సంతసిల్ల శుభమస్తని పెండిలిపాటఁ బాడి మ
ర్యాద చెలంగ నొక్కకనకాసనమందునునుంచిరొక్కెడన్.

ఉ. అక్షతలుంచె ముందు శుభమస్తని సర్వజగద్విచారణా
ధ్యక్షుని శీర్షమందు విమలాంగి యరుంధతి దేవి పైని న
క్షాత్రులు చేయఁగాఁదగినయట్టి సపర్యలు చేసి తద్వపుః
ప్రేక్షణకౌతుకాదరము పెంపున సొంపులు నింపిరయ్యెడన్.

సీ. వితతలోచన యొక్కరిత మేనిబూదిపైఁ
గపురంపుగందంబుఁ గలపిపూయ
శతపత్రగంధి యొక్కతె గజాజినముపైఁ
బసిఁడికమ్ములపట్టువలువఁ గప్ప
చంద్రాస్య యొక్కతె సర్పహారములపై
హురుమంజిముత్యాలసరులు వేయ
పల్లవాధర యోర్తు ఫాలనేత్రంబుపైఁ
బొలుపైన కస్తూరిబొట్టుఁ బెట్ట

గీ. ఒకవిలాసిని మిగుల నేర్పొదవునట్లు
జటలపై రత్నముకుటంబు సంఘటింప

విచికిలాస్త్రుని మాప మాఱిచినసామి
క్రొత్త పెండ్లికుమారుఁడై కోమరుమిగిలె. 66

గ. అట్లు లోకానుగ్రహార్థంబు ప్రాకృతపురుషుండువలె కాంతాజనంబు లలంకరించెడి యలంకారంబులనెల్ల సంగీకరించి

మ. ఋషులెల్లన్ సుముహూర్తముం దెలుపఁగా
భృంగీశ్వరాదుల్ సము
న్మిషదానందముతోడ ముందు చనఁగా
మిన్నుల్ ప్రశంసింపఁగా
విషమాస్త్రాంతకుఁ డెంతయేని ప్రమదో
ద్వేగాతిరేకంబునన్
వృషభాధీశ్వరు నెక్కి తాఁ గదలె బ్ర
హ్మేంద్రాదిబృందంబుతోన్. 68

మ. అమితోత్సాహముతో జయధ్వనులతో
నానందభావంబుతో
రమణీయప్రతిపత్తితో స్వపరివా
రంబెల్లఁ బార్శ్వద్వయీ
సముదాచారము నిర్వహింపఁగ మహే
శానుండు శీఘ్రంబుగా
హిమవత్ప్రాంగణసీమలోన దిగి మ్రో
యించెన్ మహాశంఖమున్. 69

మ. అది కర్ణంబునఁ జొచ్చుమాత్రమున శై
లాధీశ్వరుం డుచ్చల
న్మదనాగేంద్రము నెక్కి పుత్త్రిఁడగు మై
నాకుండు వెవెంట రా
నుదయన్మంగళవాద్యవైభవముతో
నుత్సాహసంపత్తితో
మదనారాతి కెదుర్కొనం జనియె స
న్మానంబు దీపింపఁగన్. 70

మ. పరమాహ్లాదముతో నెదుర్కొని వడిన్
బ్రాలేయధాత్రీధరే
శ్వరుఁ డాచార్యసమేతుఁడై గురుజనా
చారంబు మేల్పొంతిగా
వరపూజావిధినంతయుఁన్ జరిపి వై
వాహక్రియాపేక్షణా
దరవేగంబునఁ దోడితెచ్చె జగద
ధ్యక్షున్ నిటాలేక్షణున్. 71

శా. కళ్యాణాకృతితో శివుండు పురమా
ర్గంబందు నేతేర సౌ
ఫల్యం బాత్మలకబ్బె నేఁటికనుచున్
భావించి భావించి హృ

మాల్యంబేర్పడఁ గామినీజనులు లీ
లాకౌతుకోన్మత్తదృ
క్సాల్యశ్రేణి నలంకరించి రపుడా
మాయాజగన్మోహనున్. 72

సీ. ముకురంబునందుఁ జూచుకొని వీనికి నేను
తగనంచు నొకకాంత మొగము వాంచె
దొరకునే యీమనోహరుఁడు మాబోఁటుల
కనుచొక్కులలితాంగి యంగలార్చె
కనుఁగొంటిఁ గన్నులుగలిగియుంటకు నేఁడు
ఫలమంచు నొకనాతి పాడఁజూచె
తనచేయు సంసారమును రోసి యొకచాన
యతనివెంబడిఁబడి యరుగ నెంచె

గీ. ఏమి రూపవిలాసమో యేమి కళయొ
యేమి మాయాప్రభావమో యేమొకాని
రాజవీథులలోన నారాజసూను
వెడలునపు డెన్నియేనియు వింతలొదవె. 73

—♦ హైమవతీపరమేశ్వరపరిణయమహోత్సవము ♦—

గీ. అల్లనల్లన రాజరథ్యాంతరములు
గడచి పరివారములతోడఁ గౌతుకమునఁ

జేర నరుదెంచె నాచంద్రశేఖరుండు
మండితంబైన కల్యాణమండపంబు. 44

౪. అంత ఘనభానంతరంబులు పిక్కటిల్ల నందీశ్వరుండు మంగళశంఖధ్వానంబులం జేయ వందిమాగధబృందంబులు కైవారంబులొనరింప భేరీకాహళమురజడిండిమనిస్సాణతూణమర్దళాది ధ్వానంబులు బోరుకొలుప సువాసినీజనంబులు గౌరీకల్యాణగీతంబులు శ్రవణపేయంబుగఁ బాడ వేణువీణాదితంత్రీవాద్యనిర్గత మధురమధురలలితలలితస్వరరాగమూర్ఛనలు విస్మయంబుగొలుప నగురుకాదిధూపంబులు ఘ్రాణసంతర్పణంబు సేయ మునిగణాశీర్వాదంబులు మిన్నుముట్టఁ బ్రమథగణంబులు వేత్రహస్తంబులచేఁ గట్టెదుట నిలువంబడి జోహారులుసేయ రుద్రకన్యాసహస్రంబు లాస్యంబులొనరింప నానందపారవశ్యంబున వృషభేంద్రంబుసేయు ఘీంకారంబునకు రోదసీకుహరంబు ప్రతిఘీంకారంబునలుపఁ బ్రఫుల్లకుసుమవిసరంబులు పరిమళంబులు వెదచల్ల విద్యుద్యంత్రచామరంబు లన్యోన్యసంమర్దజనిత ప్రయాసంబులువాప సౌగంధ్యబంధురామృతసేకంబులు పుష్పవర్షంబునకు సబ్రహ్మచారిత్వంబువహింప దేవదేవుండగు పరమేశ్వరుండు నందీశ్వర మైనాక హస్తావలంబంబుంగొని మెల్లమెల్లన నడచుచుఁ జన కోటిసూర్యప్రభాభాసమానంబగు కళ్యాణపీఠ బు నధిష్ఠించె నంత

ఆ. వె. మెఱపుఁదీఁగసోఁగె మిఱుమిట్లు గొలుపుచుఁ
దళుకుతళుకుమనెడి కళలతోడ
శైలనాథపుత్రి చనుదెంచె సకియలు
త్రోవచూప రాణిఠీవి మెఱయ. 76

గీ. అంత నాకాంత నెల్లముత్తైదువలును
లీలమైఁ గేలు కెంగేలఁ గీలుకొలిపి
ప్రమథనాథుని వామభాగమునఁ గూను
చుండఁబెట్టిరి వేడ్కలు మెండుకొనఁగ. 77

క. లలితస్వభావుఁడగు న
న్నెలదాలుపు వేలుపునకు నిస్సీమకళా
కలితంబగు హైమవతీ
విలాస మపుడెంతయేని వేడుకగొలిపెన్. 78

ఉ. సమ్మదమేర్పడన్ గమలసంభవుఁ డయ్యెడలన్ బురోహిత
త్వమ్ము వహించిమించిన సభాస్థలమందు నెసంగు నగ్రపీ
ఠమ్మునఁ గూరుచుండి ప్రకటంబగుకంఠముతోఁ దదేవల
గ్నమ్మనిముందుచేయఁదగుకార్యముసర్వమునిర్వహించినన్

చ. చెలియలు కార్యరీతులువచించుచుఁ జెంతనునిల్వ మేనకా
జలరుహపాణి స్వర్ణకలశంబున నీరమువోయుచుండఁగాఁ
బులకలు మేననిండ హిమభూధరనాథుఁడు సమ్మదాశ్రుసం
కలనముతోడుగాఁగడిగెఁ గైరవబంధుధరాంఘ్రియుగ్మమున్

క. ఆజలకణములు దాలిచె
నాజన్మాంతరపవిత్రతాప్తికి భూభృ
ద్రాజశిఖామణి తలపైఁ
దేజోరాజత్కిరీటదీపితకలపై. 81

మ. విధి చేయించెడిశాస్త్రపద్ధతులనస్విష్టిం[illegible] స్వీయాన్వయా
వధికప్రాక్తనసంప్రదాయకలనాభ్యాసంబుతోడన్ యథా
విధిగాఁ బూజలుసేసి యల్లుఁడగు నావిశ్వేశ్వరస్వామికిన్
మధుపర్కంబు నొసంగె నద్రిపతి మేనాదేవితోఁ గూడగాన్

శా. సమ్మోదాశ్రువు లుద్గతంబగుచు సంస్తంభించి యాత్మీయభా
గ్యమ్మెల్లన్ ఫలవంతమయ్యెనని మేనాద్రీశ్వరుల్ భద్రవా
ద్యమ్ముల్ మ్రోఁగుచునుండ నప్పు డనవద్యంబైన యజ్ఞోపవీ
తమ్మున్ వేసిరి శూలికంఠమునఁ జేతస్తృప్తి సంధిల్లఁగన్.

శా. ధన్యంబయ్యెఁ గులంబుసర్వము ప్రశస్తంబయ్యె జన్మంబు స
న్మాన్యంబయ్యెఁ దపంబు పెద్దలు తరింపంగల్గిరెంతేనిమా
కన్యం బేమిటి కింక నన్న మదితో నామేనకాద్రీశ్వరుల్
కన్యాదానముఁ జేసి రీశ్వరున కాకల్పాంతరస్థాయిగాన్. 84

శా. ఆనందామృతమంతరంగములయందత్యంతముప్పొంగ నా
మేనాభూమిభృదీశ్వరుల్ మిగుల నమ్రీభూతులై వేదవి
జ్ఞానభ్రాజితులైన బ్రాహ్మణులకున్ సంశుద్ధభావంబుతో
నానాదానములాచరించిరియథాన్యాయంబుగానయ్యెడన్.

ఉ. ప్రీతిజనింపఁజిత్తమున వేపథువంగములందుఁబుట్ట నై
సేలువజాలఁ బైపయిఁకిఁ జిన్నెలువన్నెలఁ దోఁప నిట్టులో
బాలసుధాంశుశేఖరుఁడు పాణియుగంబును జాఁపి నానిభృ
న్మౌళితనూజకంఠమున మంగళసూత్రముఁ గట్టె నయ్యెడన్.

మ. కళలెల్లన్ దులకింప మోమున జగత్కల్యాణి శర్వాణి న
వ్వులతో మేలిపసిండిపళ్లెరముతోఁ బాల్పొంది వెల్గొందు క్రొం
దెలిముత్యంబులు దోయిటం గొని జగత్క్షేమంబు దీపింపఁగాఁ
దలఁ బ్రాల్పోసె సుధాంశుమౌళిపయి నుద్యద్విద్యుదాకారయై

మ. మొరసెన్ దుందుభులాడిరచ్చరలు సమ్మోదంబు దీపింపఁగాఁ
గురిసెన్ బూవుల వాన వీణెయలు పల్కుల్ వల్కె శ్రావ్యంబుగన్
మురజిన్ముఖ్యులు మోడ్చిహస్తయుగళంబుల్ గానుకలర్పించిరా
స్మరజిద్విస్ఫురదక్షతోత్సవమహోత్సాహంబులో నయ్యెడన్

క. సప్తపది నాచరించిరి
సప్తద్వీపంబులందు జానొప్పెడు మా
యాప్తుల రక్షించెదమని
సప్తపదంబులను బెట్టి చాయలు దోఁపన్. 89

మ. మురిపంబొప్పఁ బ్రధానహోమము మహా
న్మార్ధన్యుఁ డాతండు సం
స్కరణాచారపురస్సరంబగు విధిన్
గావించి తత్తత్క్రియా

పరిశేషంబులు పూర్తిచేసెఁ గ్రమముం
బాటించుచుఁ 'యద్యదా
చరతి శ్రేష్ఠ'యటన్న వాక్యమునకుఁ
సార్థక్యమేపారఁగన్. 90

ఉ. హృత్సరసీరుహంబులకు నెంతయు వేడుక సంఘటిల్లఁగా
సత్సము దాయమెల్లను బ్రశంసలొనర్పఁగ మింటనుండి దీ
వ్యత్సుమనర్ఘముల్ గురియ భద్రనినాదముమించఁగా వసం
తోత్సవవైభవంబు గనన్నొప్పె నుమాపరమేశ్వరీయమై. 91

గీ. అప్పుడాత్మీయపతివియోగాగ్రశయాశ
దారుణాభీలహేతిసంతప్యమాన
గాత్రియైన రతీదేవి కాలకంఠు
పాదములమీఁద జివ్వున వచ్చి వ్రాలె. 92

క. వ్రాలినయాయమ యెడఁ గడు
జాలింగొని లేవనెత్తి చయ్యన గంతే
కాలుఁడు తత్కాంక్షకు నను
కూలముగ ననుగ్రహించెఁ గుసుమాస్త్రు నొగిన్. 93

క. విషమాస్త్రుఁడు వచ్చి సము
న్మిష దాకారంబుతోడ దివిషత్సభలో
ఋషిజనసేవితుఁడగు నా
విషమాక్షున కెరగె భక్తివిహితాంజలియై. 94

శా. అత్యాశ్చర్యముగల్గె నెల్లరకు రత్యక్షాక్షికిం తేనియున్
మత్యుత్సాహమెలర్చె దేవతలకున్ భాగ్యంబులీడేఱె నా
నృత్యంబేర్పడె విమానకేతనునకున్ బ్రాలేయ శైలాధిపా
పత్యాత్మేశ్వరసుప్రసన్నకరుణాపాంగ ప్రసారంబునన్. 95

గీ. అంత హిమవంతుఁ డేతెంచినట్టి పెండ్లి
పెద్దలకునెల్లఁ దగినట్లు వేవితముల
సత్కృతులుచేసె మానసోత్సాహ మొదవ
హస్తములుమోడ్చి భక్తిరక్త్యంచితముగ. 96

ఉ. ఆతటనంతరంగములయందుఁబ్రమోదమునొంది భూమిభృ
త్కాంతునిఁగాఁగిలించికొని ధన్యుఁడవైతివి నీవు నీకులం
బెంతయుఁ బూజ్యమయ్యెఁ బరమేశ్వరుఁడీవిధినల్లుఁడౌటచే
నింతటిభాగ్యమెవ్వరికినేని లభించునొకో? గిరీశ్వరా! 97

గ. అని పెక్కువిధంబుల నాతని కృతకృత్యత నుగ్గడించి 98

శా. బ్రహ్మర్షుల్ పరిణిష్ఠితాత్మలయి కొల్వన్ శైలజాయుక్తుఁడై
బ్రహ్మాండంబులకెల్ల సాక్షియగు శేవన్ భద్రపీఠంబునన్
బ్రహ్మానందముతోడనుండు భవునానన్ మూర్ధ్నిఁ దాల్చి యా
బ్రహ్మేంద్రాదిసుపర్వ లేగిరి నిజావాసంబులన్ జేరఁగన్.

ఉ. భూమిధరాత్మజాసుగుణపుష్టిసమంచితమై మహేశ్వర
ప్రేమరసాస్పదంబయి యభిజ్ఞులకెల్లరకింపునింపు నీ
హైమవతీవిలాస మెవరైనఁ బఠించిన నాలకించినన్
గామితము ఫలించుటయకాక పదంబడి మోక్షమున్బడిన్.

క. జయజయ హైమవతీశ్వర !
జయజయ సకలప్రపంచసమాశ్రితమూర్తీ !
జయజయ కరుణాసాగర !
జయజయ సుకవిజనహృదయసరసిజవర్తీ ! 101

క. దేవాదిదేవ ! నిర్మల
భావసముద్భాసకస్వభావా ! వినివృ
త్తావరణ ! బదినహోలుపు
రావాసా ! మల్లికార్జునా ! పరమేశా ! 102

ఉత్సాహము.

మౌనిజనతపఃఫలాయమాన ! పారమార్థిక
జ్ఞానగమ్యమానసుప్రశాంతరూప ! హైమవ
త్యాననాబ్జమిత్ర ! త్రిభువనాంతరస్థ ! సర్వశ
మ్మాననీయ ! బదినహోలుమల్లికార్జునప్రభూ ! 103

గద్యము.

ఇది శ్రీమత్పరమపవిత్ర భారద్వాజసగోత్రాపస్తంబసూత్ర
సీతారామపుత్ర కనకాంబాగర్భశుక్తిముక్తాఫల పరమేశ్వర
ప్రసాదసముపలబ్ధసుకవితాభాగధేయ శతావధాన
విధానధౌరేయ కావ్యకళానిధి చిదంబరనామ
ధేయ ప్రణీతంబగు హైమవతీవిలాసంబను
మహాప్రబంధంబున సర్వంబును
తృతీయాశ్వాసము.